# ఆంధ్రప్రదేశ్



తటిల్లతలు—తాజ్ మహల్

మే, 1966

25 పైసలు

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 10 మే, 1966
సంచిక : 7 వైశాఖ - జ్యేష్ఠ 1888 శకం
ప్రధాన సంపాదకులు: సంపాదకులు :
టి. రామచంద్రరావు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## ఈ సంచికలో

**గమనిక**

1966 జూన్ మాసం నుండి
**ఆంధ్రప్రదేశ్**
విడిప్రతి వెల 30 పైసలు

మొదటి చిత్రం :

తటిల్లతలు - తాజ్ మహల్
ఫొటో : ఎస్. ఆర్. కె. రావు

రెండవ చిత్రం :

సుందర భవిష్యత్తుకు సోపానాలు —
పోచంపాడు ఆనకట్ట

మూడవ చిత్రం :

విపినవైభవం

నాలుగవ చిత్రం :

మనుషులు - మరలు —
పోచంపాడు ఆనకట్ట

ఫొటోలు : ప్రధాన సంపాదకులు.

ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు.

# వ్యవసాయం, మన జీవనాడి



ప్రపంచంలోని వ్యావసాయిక దేశాలలో భారతదేశం ఒకటి. భారత దేశం వ్యావసాయిక దేశంగా ప్రసిద్ధికెక్కడానికి యిక్కడి భౌగోళిక పరిస్థితులే ప్రధానకారణంగా పేర్కొనవచ్చు. వ్యవసాయానికి ప్రధానంగా అవసరమైన జీవనదులు, సుదీర్ఘమైన కొండల బారులు, సువిశాలమైన మైదానాలు, దట్టమైన కీకారణ్యాల వంటి ప్రకృతి సంపద మనకు అపారంగా వుంది. తూర్పున సమున్నతమైన హిమగిరులు నిత్యమూ మంచువలువలు చుట్టుకుని అపార జలరాశిని అనవరతమూ కరిగిపారించి; గంగా, సింధు, బ్రహ్మపుత్ర నదులలోకి సారవంతమైన వండ్రుమట్టిని చేర్చి, భూసార సంపదను నిక్షిప్తం చేస్తున్నాయి. సువిశాలమైన యీ నదీమైదానభూములు వ్యవసాయానికి ఆటపట్టుగా విలసిల్లుతున్నాయి. దక్షిణాదిన అటు పడమటి కనుమలు, ఇటు తూర్పు కనుమలు ఆయా ఋతువులలో సముద్రంమీంచి వీచే వర్షవాయువులను అడ్డగించి, వర్షజలాలను దివినుండి భువికి దింపి, దక్షిణ భారతావనిని శుభ్రజలాలతో తడిపి పునీతం చేస్తున్నాయి. గోదావరి, కృష్ణ, పెన్న, కావేరి, తామ్రపర్ణి నదులు, వాటి అసంఖ్యాక ఉపనదులు ఈ ప్రాంతాన్నంతటినీ ఐశ్వర్యవిలసితం చేస్తున్నాయి. ఇలా యావత్ దేశాన్నీ ఆవర్తించి ప్రవహించే యిన్ని నదులు మరే దేశంలోనూ లేవు. ఒకవిధంగా చెప్పాలంటే భారతదేశం నదుల దేశం. అందువల్లనే శతాబ్దాల తరబడి మన ప్రజలకు వ్యవసాయము ముఖ్యజీవనాధారంగా వుంటూవస్తోంది.

కైబరుకనుమ ద్వారా మన దేశంపైకి ఎన్నోసార్లో దండయాత్రలు జరిగాయి. చాలామంది దురాక్రమణదారులు దేశాన్ని కొల్లగొట్టి వెళ్ళిపోయారు. ఇక్కడే వుండిపోయి యీ దేశప్రజలతో కలిసిపోయినవారు మొగలు లొక్కరే. మొగల్ వంశం నాలుగువందల సంవత్సరాలపాటు మనగలిగింది. వ్యవసాయాన్ని ఉచ్ఛస్థితికి కొనిపోయింది. చెరువులు, బావులు త్రవ్వి వ్యవసాయాభివృద్ధికి మొగల్ రాజులు తోడ్పడ్డారు. మన ప్రభువులు—అటు ఉత్తరాన అశోకుడు, హర్షవర్ధనుడు; యిటు దక్షిణాన విజయనగర, కాకతీయ, పల్లవ, చోళవంశరాజులు ఈ దేశంలో వ్యవసాయాన్ని మెరుగుపరిచి, దాని సర్వతోముఖవికాసానికి తీవ్రంగా కృషి చేశారు. కాని ఆంగ్లేయులు మన దేశాన్ని ఆక్రమించుకున్న తర్వాతనే యీ రెండు వందల సంవత్సరాలుగా వ్యవసాయాభివృద్ధి కుంటుపడింది. ఆకాలంనాటి కొంతమంది ప్రముఖుల వేదికల్ని పరిశీలించి చూస్తే యీ విషయం తేటతెల్లం కాగలదు.

జి. తాంప్సన్ అనే పరిశీలకుడు 1838 లో 'భారతదేశము, దేశ రాజ్యాలు' అన్న వ్యాసంలో యీ విధంగా పేర్కొన్నాడు.

"దేశాభ్యుదయానికి, దేశ ప్రజల శ్రేయస్సుకు ఆనాడు హిందూ, ముసల్మాను ప్రభువులు నిర్మించిన రోడ్లు, చెరువులు, కాలువలు యిప్పుడు జీర్ణస్థితిలో ఉన్నాయి."

భారతదేశంలో ఆధునిక నీటిపారుదల పనులకు ఆద్యుడనదగిన సర్ ఆర్థర్ కాటన్ 'భారత దేశంలో పబ్లిక్ వర్క్స్' అన్న తన నివేదికలో సెలవిచ్చిన విషయాలను పరిశీలిస్తే యీ విషయం మరింత స్పష్టపడుతుంది.

"ఇంచు మించు భారతదేశంలో పబ్లిక్ వర్క్స్ పనుల్ని చేపట్టే విషయంలో బాగా అలక్ష్యం జరుగుతోంది. ఏమీ చెయ్యకుండా నీటికీ, రోడ్లకు, వచ్చే లక్షలాది ఆదాయాన్ని వ్యర్థపరుస్తూ, ఏమీపట్టించుకోని అలసత్వమే యింతవరకు ప్రబలివుంది"

స్వాతంత్ర్యానంతరం గురుతరమైన బాధ్యతను మనదేశం వహించవలసి వచ్చింది. జీర్ణావస్థలోవున్న వ్యవసాయ ఆర్థిక స్వరూపాన్ని పరిపుష్టిగావించి ఒకానొక ప్రయోజనాత్మక మార్గంలో దాని అభివృద్ధికి, ఉజ్జ్వల భవిష్యత్తుకు తీవ్రంగా కృషిచేయవలసిన అవసరం దేశ భుజస్కంధాలమీద పడింది. రెండువందల సంవత్సరాలుగా అలక్షింపబడుతూ నామమాత్రావసిష్టంగా మిగిలిన వ్యవసాయ ఆర్థికవ్యవస్థను ఒక్కరోజులో చక్కబరచడం సాధ్యంకాదు. అయినప్పటికీ మన ప్రభుత్వం అతి సాహసంతో యీ బృహత్తర భారాన్ని తన భుజస్కంధాలమీద వేసుకుంది. నీటి వనరులను మరింతగా అధికంచేసి, తద్వారా వ్యవసాయోత్పత్తిని

పెంచడానికి భారీఎత్తున రివర్ వేలీ ప్రాజెక్టులకు చేపట్టింది. గతంలో ఎంత అట్టడుగునవున్నామో ఆలోచించి యీనాడు మనం— స్వాతంత్ర్యంవచ్చిన యీ పద్దెనిమిదేళ్ళ కొద్దిపాటికాలంలోనూ సాధించినది ఎంతుందో బేరీజువేసుకుని చూస్తే యిది నిజంగా గొప్ప విశేషమే అనకతప్పదు. మొదటి రెండు పంచవర్ష ప్రణాళికల్లోనూ వ్యవసాయ రంగంక్రింద రూ. 1500 కోట్లకుపైగా వెచ్చించడం జరిగింది. సాగుభూమి 515 లక్షల ఎకరాలనుంచి 700 లక్షల ఎకరాలకు పెరిగింది. తృతీయ పంచవర్ష ప్రణాళికలో సాగుభూమిని మొత్తం 900 లక్షలకు పెంచాలని, యిందుకు రూ. 1738 కోట్ల ఖర్చు అవుతుందని అంచనా. ఆహారధాన్యాలు, పప్పుధాన్యాలు, కాయధాన్యాలు 1950–51 లో దిగుబడి 522 లక్షల టన్నులుకాగా 1964–65 లో 890 లక్షల టన్నులకు పెరిగింది.

ఇంత తీవ్రంగా కృషి జరిగినప్పటికీ దేశం యింకా స్వయం సమృద్ధంకాలేదు. ఇందుకు కారణం—

1. రెండవ ప్రపంచయుద్ధం తర్వాత అనేకదేశాలలో ఆర్థిక వ్యవస్థ తీవ్రమార్పులకు గురిఅయింది. దీనిఫలితంగా దూర ప్రాచ్యం, యితరదేశాలనుండి మనవార్షిక అవసరాలకు వీలుగా జరిగే ఆహారధాన్యాల సరఫరా వనరులు పూర్తిగా బందుకావడం గానీ, క్లిష్టతరంకావడంగానీ జరిగింది.

2. ప్రజల ఆహారం అలవాట్లుకూడ మారాయి. దీనివల్ల క్రొత్త సమస్యలు ఉత్పన్నమైనాయి.

3. ప్రజల ఆయుః ప్రమాణం పెరిగింది. దీనికితోడు జనాభా పెరుగుదల తారస్థాయిని అందుకుంది. సమస్యను క్లిష్టతరం చేయడానికి ఇవన్నీ తోడ్పడ్డాయి.

అయితే ఇవన్నీ అధిగమింపలేనివేమీకాదు. మనజాతి దృఢ నిశ్చయంతో కృషిచేస్తే యీ సమస్యలను పరిష్కరించవచ్చు. గత 2, 3 శతాబ్దాల కాలంలో వ్యవసాయశాస్త్రం, సాంకేతిక విజ్ఞాన శాస్త్రం అమోఘ విజయాలను సాధించాయి. వీటిఫలితంగా ఆధునిక వ్యవసాయ పరికరాలు, ఎక్కువ దిగుబడినిచ్చే మేలురకం విత్తనాలు, అనేకరకాలైన ఎరువులు, క్రిమిసంహారక మందులు వగైరా కనుగొనబడినాయి. అమెరికా, జపాన్‌వంటి దేశాలు తమ వ్యవసాయోత్పత్తులను అధికతమం చేశాయి. అటువంటి సౌకర్యాలే మన దేశంలోను కల్పిస్తే చెప్పుకోదగిన ఫలితాలు సాధించలేక పోవడంలో కారణం కనిపించదు. ఈ సందర్భంలో మన ప్రథమ ప్రధాని కీ. శే. పండిత జవహర్‌లాల్‌నెహ్రూ పూరించిన శంఖారావాన్ని గుర్తుతెచ్చుకోవడం చాలాఅవసరం.

"వ్యవసాయం, ఇప్పటికీ మనప్రధాన సమస్యగా ఉన్నది. మనకృషిలో ఏమాత్రం సడలింపు జరిగినా అది మన ప్రణాళికలనే తలక్రిందులుచేస్తుంది. అందువల్ల వ్యవసాయోత్పత్తులను అధికం చేయడానికి మనం తీవ్రంగా కృషిచేయాలి. ఆవిధంగా జరగనప్పుడు మనప్రణాళికలు సత్ఫలితాలను ఇవ్వలేవు – మనకు మరో మార్గాంతరంలేదు."

భారతదేశంలోని అనేక రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయోత్పత్తిలో అగ్రగామిగా ఉన్నది. ప్రకృతి వనరుల చల్లని చూపువల్లనే మనం యీ ఆహ్లాదకరమైన స్థితిలో ఉన్నాము. గోదావరి, కృష్ణా, పెన్నార్, తుంగభద్ర వంటి మహానదులు మనకు ఉన్నాయి. ఇవి, వీటి ఉపనదులూ మన పొలాలకు నిరంతరం పుష్కలంగా నీరు అందించడమేగాక భూములను సారవంతం చేస్తున్నాయి. మన కర్షకులు కష్టజీవులు, దక్షతగలవారు, అభివృద్ధికి చేటు కలిగించే పాత అలవాట్లు సంప్రదాయాలు, ఆచారాలను త్యజించడానికి మన రైతులు వెనుకంజవేయరు. అంతేగాక అధికోత్పత్తిని సాధించడానికి వ్యవసాయంలో ఆధునిక పరికరాలు, ఎరువులు, క్రిమిసంహారక ఔషధాలు వినియోగించడంలో వారు ముందుకు వచ్చి ఎంతో ఉత్సాహం వ్యక్తంచేస్తారు.

రైతుల పవిత్ర కృషికి ప్రభుత్వంకూడ ఎంతగానో తోడ్పడుతున్నది. వ్యవసాయ కార్యక్రమాలకై మొదటి ప్రణాళికలో రు 12.30 కోట్లు, రెండవ ప్రణాళికలో రు 37.14 కోట్లు కేటాయించారు. మూడవ ప్రణాళికలో రు. 79.84 కోట్లు ఉంటుంది. మొదటి ప్రణాళిక ప్రారంభంలో సేద్యం విస్తీర్ణం 181.47 లక్షల ఎకరాలు ఉంది. మూడవ ప్రణాళిక ఆఖరునాటికి యీ విస్తీర్ణం 336.50 లక్షల ఎకరాలకు పెరుగుతుందని ఆశించబడుతున్నది. ఆహార ధాన్యాల విషయంలో దేశం స్వయం సమృద్ధినీ, స్వయం శక్తినీ సాధించడానికి జరుగుతున్న పవిత్ర కృషిలో మన రాష్ట్రం కూడ పాల్గొనడం మనకు గర్వకారణమైన విషయం. ఆహార ధాన్యాల విషయంలో మనది మిగులు రాష్ట్రమైనప్పటికీ వ్యవసాయోత్పత్తులను అధికం చేయడానికి గత 15 సంవత్సరాలుగా మనం గమనార్హమైన కృషిచేయడం మరో గర్వకారణమైన విషయం. మన కృషిని యీ విధంగానే కొనసాగిస్తాము. అవసరంలో ఉన్న యితర రాష్ట్రాలను ఆదుకోవడానికి వీలుగా లభ్యమయ్యే వనరులన్నిటినీ పూర్తిగా వినియోగించుకొని గరిష్ఠ ఫలితాలను సాధించడమే మన ఆశయం.

మన కర్షకులు అధికోత్పత్తిని సాధించి తద్వారా ఆహార ధాన్యాలకై విదేశ సహాయం అక్కరలేకుండా చేయాలనే మన దేశసంకల్పానికి, దోహదం కలిగించడానికి వీలుగా సాధ్యమైనంత త్వరలో భారీ, మధ్యరకం ప్రాజెక్టుల నిర్మాణం పూర్తిచేయాలని మనప్రభుత్వం దృఢసంకల్పంతో కృషిచేస్తున్నది.

జైహింద్ ! జై కిసాన్ !

[signature]

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

# పంచతంత్రము

## జరిగినకథ

సంజీవకుని స్నేహముచే పింగళకుడు జ్ఞానశీలి ఆయెను. దమనకుడు ఉపాయముతో ఎన్నోపనులు సాధించవచ్చునని చెప్పి ఉదాహరణముగా, కృష్ణసర్పము ఉపాయముచే రాజభటులతో చచ్చుట మరియు, ఎండ్రకాయ కథనుకూడ చెప్పి సంపన్నమగు భాసురకుడు అను సింహము చాల చిన్న జంతువు అగు కశముచే చచ్చుటను వివరముగా తెల్పును.

దమనకుడు కరటకుని సలహా ప్రకారము పింగళకుని వద్దకు పోయెను. సంజీవకుడు లేని సమయము చూచి మృగపతికి నమస్కరించి అతనివద్ద కూర్చొనెను.

పింగళకుడు : భద్రుడా! చాలాకాలమునకు కనపడితివేమి?

దమనకుడు : దేవరవారికి మాతో పని యేమని నేను రాకున్నాను. అయినను రాజుకు కలుగు కష్టమును చూడలేకున్నాను. మనస్సు దహించుచున్నది. అసలుసంగతి తమకు నివేదించుటకు స్వయముగా వచ్చితిని.

పింగ : చెప్పదలచిన దేదో చెప్పుము.

దమన: దేవా! సంజీవకుడు మీకుద్రోహము తలపెట్టుచున్నాడు. అతడు రహస్యముగా నాతో ఈ మాటలు అన్నాడు. ''దమనకా! పింగళకునియొక్క బలాబలములను నేను కనిపెట్టినాను. కనుక అతనిని నేను చంపెదను. సకలమృగాధిపత్యమును ఆక్రమించెదను. అప్పుడు నేను నిన్నే ప్రధానమంత్రిగా చేసెదను.''

పిడుగువంటి దారుణమైన యీ మాట విని పింగళకుడు నోట మాటలేక మూర్ఛిల్లెను. దమనకుడు అతని ఆ అవస్థను చూచి ''ఇతడు సంజీవకుని పూర్తిగా విశ్వసించి ఉన్నాడు. తప్పక అతనివలన యితనికి వినాశము ఏర్పడును...'' అనిచింతించెను.

పింగళ : (మూర్ఛ తేరుకొని బాధపడుచు) దమనకా! సంజీవకుడు నాకు ప్రాణతుల్యుడైన సేవకుడు. నాయెడల ద్రోహమేల తలపెట్టును?

దమన : దేవా! సేవకుడు ఎల్లపుడు విశ్వాసపాత్రుడుగా ఉండుట అసంభవము. స్వార్థబుద్ధితో నే రాజులను వారు సేవించుచుందురు.

పింగళ : భద్రుడా! అయినను అతనియెడల నా యభిప్రాయము మారకుండా ఉన్నది.

దమన : అందువల్లనే యీ ద్రోహము కలిగినది. గుణములుచూచి సంజీవకుని మీరు దగ్గర చేర్చినారు. అతని శరీరము బాగా బలసిఉన్నది కనుక అతని సహాయముతో శత్రువులను జయించవచ్చుననుకుంటిరా? మీ శత్రువు లందరును మాంసము తినువారుకదా! గడ్డి తిని బ్రతుకు సంజీవకుడు యుద్ధములో మీ కేమి సహాయము చేయగలడు? అందువలన నితని సహాయముతో మీకు శత్రుజయము సిద్ధించుట కల్ల. కనుక మీ యెడల ద్రోహము తలచువానిని చంపివేయుడు.

పింగళ : పూర్వము నీ మాటపై అతనికి నేను ఆశ్రయము, అభయము నిచ్చితిని. ఇప్పుడు నేనే యెటుచంపగలను? ఇప్పుడు అతడు అన్నివిధముల నాకు మిత్రుడుగ నున్నాడు. అతని యెడల నాకు కోప మేమియులేదు. కాబట్టి అతడు నాపై ద్రోహము తలచినను నేను అతనికి విరోధము చేయలేను.

దమన : స్వామీ! ద్రోహబుద్ధి గలవానిని కూడ క్షమించుట రాజధర్మమా? అతని యందలి స్నేహముచేత మీ రాజధర్మమునే వదులుకొనుచున్నారు. అట్లయినచో నితర పరిజనమంతయు మిమ్ము విడిచి పోవును. ఎందుకనగా సంజీవకుడు గడ్డితినువాడు. మీరు, మీ కాప్తులైన యితరులును మాంసభోజనులు. మీరు ఇతనిని వధించకున్నయెడల మీ పరివారమునకు మాంసము లభించదు. అందుచేత వారు మిమ్ము విడిచివెళ్లెదరు. ఆత్మబంధువులు మీకు దూరమగుదురు. సంజీవకునితో కలిసియున్న మీకు యుద్ధములో సహాయము చేయుటకు ఎప్పుడును వారు రారు. నీచులతో సాంగత్యము మీవంటి పెద్దలకు తగదు. పూర్వ మొకప్పుడు ఒక దుష్టమైననల్లికి ఆశ్రయమిచ్చి ఒక పేను నాశనమొందెను

పింగళ : ఆ కథ ఎట్లు చెప్పుము.

దమన : ఇట్లు చెప్పదొడగెను.



## చీరపేను, నల్లి కథ

ఒకరాజుయొక్క రమ్యమైన పడక మంచముపై పరువబడిన తెల్లని రెండుదుప్పట్ల నడుమమందలి సర్పిణి యను పేరుగల ఒక తెల్లని చీరపేను నివసించుచుండెను. అది ఆరాజు నిద్రించినప్పుడు మెల్లగా అతని నెత్తురును కొద్దికొద్దిగా పీల్చుచు సుఖముగా కాలము గడుపుచుండెను. ఒకనాడు ఎక్కడి నుండియో 'అగ్నిముఖము' అను పేరుగల నల్లి ఆ పరుపులోనికి వచ్చెను. దానిని చూచి దుఃఖపడి...

పేను: అగ్నిముఖా! యీ స్థానము నీకు తగినది కాదు. ఎందుకు వచ్చితివి. నిన్ను ఎవ్వరు చూడకపూర్వమే వెడలిపొమ్ము.

నల్లి: దేవా! ఇంటికి అతిథిగా వచ్చిన వాడు దుష్టుడైనను యిట్లు అనకూడదు. నేను ఇంతదాక ఎందరి రక్తమో త్రాగినాను. వారి వారి ఆహారమునుబట్టి, కారము, పులుపు, వగరు, మొదలైన రుచులుగల రక్తమునే నేను ఆస్వాదించితిని. కాని యింతదాకా నాకు మధురమైన రాజరక్తము దొరకలేదు. నీవు అనుగ్రహించిన యెడల, పంచభక్ష్యములు సేవించు ఈ రాజుయొక్క అమృతోపమానమైన రక్తము నాకు లభించును. దానిని త్రాగుటచేత నా నాలుకను వినోదింప జేసెదను. నేను నీకు అతిథిగా వచ్చి ఆకలితో అన్నము వేడుచున్నాను. ఇట్టినన్ను విడచి నీవు ఒంటరిగ భోజనము చేయుట తగదు.

పేను: ఓ నల్లీ! ఈరాజు నిద్రించునప్పుడు నేను ఇతని రక్తమును మెల్లగా త్రాగుదును. నీవో! అగ్నిముఖుడవు, చపలుడవు, కనుక భయపడుచున్నాను. నీవు త్రాగదలచిన యెడల కొంత వేచి ఉండుము. నేను త్రాగిన తరువాత మెల్లగా, తృప్తిగా నీవు త్రాగవచ్చును

నల్లి: దేవా! అట్లే కానిమ్ము. నీకంటె ముందుగా నేను రక్తము త్రాగనని దేవునిపై తల్లిదండ్రులపై ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను.

"ఇట్లు వారు మాట్లాడుచుండగనే రాజు వచ్చి పరుపుపై పరుండెను. వెంటనే ఆనల్లి జిహ్వాచాపల్యముచేత ఆగలేక, మేలుకొనియున్న రాజునే గట్టిగా కుట్టెను. వెంటనే రాజుకు సూది గ్రుచ్చినట్లు నొప్పిగలిగి ఆ శయనము విడిచి లేచెను. సేవకులను పిలిచి "యీ దుప్పటిలో నల్లియో, పేనో నన్ను కరచినది చూడుడు," అని చెప్పెను.

సేవకులు జాగ్రత్తగా ఆ దుప్పటిని విప్పి చూచిరి. ఇంతలో ఆ నల్లి త్వరగా పోయి మంచము సందులో దూరుకొని యుండెను. పేను స్వభావముచేతనే మందముగా నడచునది. అప్పుడు భయముచేత కాళ్ళాడక ఆ దుప్పటిలోనే నక్కియుండెను దానిని పట్టుకొని రాజసేవకులు చంపిరి."

దమనకుడు పైకథచెప్పి, "దేవా కాబట్టి పరిచయములేని వ్యక్తికి ఆశ్రయము ఇవ్వకూడదు. సత్యము తెలిసికొని సంజీవకుని చంపుము; లేకున్నచో అతడు నిన్నుతప్పక చంపగలడు."

ఎట్లనగా ఆప్తులనువిడిచిపెట్టి బైటివారిని దగ్గర చేర్చి విశ్వసించిన వ్యక్తి "కకుద్ద్రుమ" రాజువలె నాశనము జెందగలరు.

పింగళ: ఆ కథ యేమి చెప్పుము.

దమన: ఈ క్రిందివిధముగా కథ చెప్పుటకు ఆరంభించెను.

(సశేషము)

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

మార్చి 19: అనకాపల్లిలోని ప్రభుత్వ చెరకు పరిశోధక కేంద్రం స్వర్ణోత్సవ సభకు కేంద్ర ఆహారమంత్రి ప్రారంభోపన్యాసం చేశారు.

మార్చి 23: 1965 లో ఉత్తమ చలన చిత్రాలుగా ఎన్నికైనవాటికి హైదరాబాదులో ముఖ్యమంత్రి రాష్ట్రప్రభుత్వ బహుమతులను అందజేశారు.

మార్చి 27: అధికార భాషా బిల్లును రాష్ట్ర శాసనసభ ఆమోదించింది.

షాద్‌నగర్‌లో యునసెఫ్ సహకారంలో ఏర్పాటు చేసిన పాల శీతల కేంద్రానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవము చేశారు.

హైదరాబాదులో సెంట్రల్ ఇంగ్లీష్ ఇనిస్టిట్యూట్ భవనాలకు ఉపరాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు.

మార్చి 30: బేగంపేటలో అఖిల భారత తొమ్మిదవ పౌరవిమానయాన శాఖ సిబ్బంది సంఘం సమావేశానికి శ్రీ కె. కామరాజు ప్రారంభోత్సవం చేశారు.

మార్చి 31: ఫతేమైదాన్ స్టేడియం స్వర్గీయ లాల్‌బహదూర్ శాస్త్రి స్మృతికి అంకితము చేయబడి, శ్రీ కె కామరాజ్ చేత లాల్‌బహదూర్ స్టేడియంగా నామకరణం చేయబడింది.

ఏప్రిల్ 1: హైదరాబాదులో సోవియట్ చలన చిత్రోత్సవానికి గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.

ఏప్రిల్ 3: హైదరాబాదులోని మలకపేటలో బహు అంతస్తులుగల తక్కువ ఆదాయవర్గం హౌసింగ్ కాలనీకి ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.

ఏప్రిల్ 6: పొగాకు ఎగుమతి అభివృద్ధి మండలి హైదరాబాదులో సమావేశమైంది.

## భారతదేశంలో

మార్చి 16: సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా శ్రీ ఎ. కె. సర్కార్ పదవీ స్వీకారం చేశారు.

మార్చి 19: రెండు రోజులపాటు జరిగే దిగుమతులు, ఎగుమతుల సలహా మండలి తాలూకు సమావేశానికి కేంద్ర వాణిజ్య శాఖ మంత్రి కొత్తఢిల్లీలో ప్రారంభోత్సవం చేశారు.

మార్చి 21: ప్రస్తుత పంజాబు రాష్ట్రాన్ని భాషా ప్రాతిపదిక పద్ధతిని పునర్వ్యవస్థీకరించాలన్న పార్లమెంటరీ కమిటీ సిఫారసులను కేంద్ర ప్రభుత్వం 'సూచన ప్రాయం'గా ఆమోదించింది.

మార్చి 22: ఆసియా, దూర ప్రాచ్య రాజ్యాల ఆర్థిక మండలి 22వ సమావేశానికి ప్రధానమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

మార్చి 30: 1966-67 సం. నకు దిగుమతి విధానాన్ని భారత ప్రభుత్వం ప్రకటించింది.

ఏప్రిల్ 3: ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధి మాస్కోనుండి కొత్తఢిల్లీ చేరుకున్నారు.

ముగ్గురు సభ్యులుగల కువాయత్ వాణిజ్య ప్రతినిధివర్గం బొంబాయి చేరుకుంది.

ఏప్రిల్ 6: సింహళ, భారతదేశాలను విడదీసే పాక్ జలసంధిని శ్రీ మిహిరసేన్ ఈదారు.

ఏప్రిల్ 8: తుంగభద్ర హైలెవెల్ కాలువ జలాలను పంపిణీ చేసుకునే విషయంలో ఆంధ్రప్రదేశ్, మైసూరు రాష్ట్రాలు ఒక ఒప్పందానికి వచ్చాయి.

ఏప్రిల్ 9: రాష్ట్రాల ముఖ్యమంత్రుల, ఆహారమంత్రుల సమావేశానికి ప్రధాన మంత్రి ఢిల్లీలో ప్రారంభోత్సవం చేశారు. నాగసమస్యపై రెండవసారి చర్చలు ప్రారంభమయ్యాయి.

ఏప్రిల్ 11: నేపాలు మంత్రిమండలి అధ్యక్షుడు శ్రీ సూర్యబహదూర్ థాపా కొత్తఢిల్లీ చేరుకున్నారు.

## విదేశాలలో

మార్చి 25: ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి ప్యారిస్ చేరుకున్నారు.

మార్చి 28: రెండు రోజుల పర్యటనపై ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ వాషింగ్టన్ చేరుకున్నారు.

# చార్మినార్ నూరుకోట్లు




# మేరను దాటింది

## భారత దేశములో ముందెన్నడూ లేనంత మొత్తంలో అమ్మకము

ఒక సారి ఆలోచించండి: నూరు కోట్లు. అంటే [illegible] వెయ్యి [illegible]
అందుకనే ప్రతి నెలా ఎక్కువ చార్మినార్ సిగరెట్లు కాల్చబడుతున్నాయి.
అంటే, ప్రతి రోజు 33,333,333 సిగరెట్లు కాల్చబడుతున్నాయన్న
మాట. ఏయితర రెండు రకాల సిగరెట్ల అమ్మకపు మొత్తాలు కలిపినా
అంత మొత్తముకాదు. అందులో ఆశ్చర్యంలేదు. కారణం,
ఎక్కువ వాసన కలిగి వుండటంలో చార్మినార్ తో మరే
ఇతర సిగరెట్లు పోటీకాదు. అద్వితీయమైన రుచి.
దేశమంతటా ప్రజా మన్ననలు కూడా [illegible] పొందింది.

అద్వితీయమైనది చార్మినార్—
ఇండియాలో ఘనత వహించిన సిగరెట్!





ది వజీరు సుల్తాను టుబాకో కంపెనీ లిమిటెడ్
భారత దేశమంతట ఘనత వహించిన సిగరెట్ నిర్మాతలు

# ప్రభుత్వ నిర్ణయాలు

✻ చిత్తూరు జిల్లాలోని "బహుదాప్రాజెక్టు" పథకాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది. రు. 31 లక్షల అంచనా ఖర్చుతో దీని నిర్మాణాన్ని చేపట్టాలనికూడ నిర్ణయించింది. ఈ ప్రాజెక్టు ద్వారా 2800 ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలు కల్పించబడుతుందని ఆశించబడుతున్నది.

✻ ఆహారోత్పత్తికి సంబంధించిన కార్యక్రమాలను సమన్వయం చేయడానికి వీలుగా నీటి పారుదలశాఖ, సహకారశాఖ, పంచాయతీరాజ్ శాఖల మంత్రులు సభ్యులుగా మంత్రివర్గ ఉపసంఘాన్ని నియమించాలని నిర్ణయించబడింది.

✻ 1967 జనవరి 22వ తేదీ నుండి 1967 ఫిబ్రవరి 22వ తేదీ వరకు మద్రాసులో జరిగే భారతీయ అంతర్జాతీయ వాణిజ్య, పరిశ్రమల సంతలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పాల్గొనడానికి నిశ్చయించబడింది.

"అఖిల భా:త ఉత్పత్తిదారుల" సంస్థ యీ సంతను నిర్వహిస్తున్నది.

✻ మురుగునీటి పారుదల, నీటి సరఫరాల నిమిత్తం రాష్ట్రములోని మునిసిపాలిటీలకు భారత జీవిత భీమా కార్పొరేషన్ వారు యిచ్చే రు. 140. లక్షలకు హామీగా ఉండడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

✻ స్పిన్నింగ్ మిల్లు యంత్రాల ఆధునీకరణ నిమిత్తం ఆజంజాహీ మిల్సుకు రు. 175 లక్షల రొక్కం-రుణం గ్యారంటీ ఇవ్వాలని ప్రభుత్వం నిర్ణయించింది.

# ఆంధ్రప్రదేశ్‌కు ప్రముఖ అతిథుల రాక



హైదరాబాదులో సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీషు తాలూకు ఎకడమిక్ అడ్మినిస్ట్రేటివ్ హాస్టలు భవనానికి మార్చి 27న ప్రారంభోత్సవం చేసిన ఉపరాష్ట్రపతి డా. జాకీర్ హుసేన్.



మార్చి 14న బేగంపేట విమానాశ్రయంలో నైరోబి మేయరు ఆల్డర్ మన్ ఛార్లెస్ డబ్ల్యు. రుబియ, కిసుము మేయర్ శ్రీమతి గ్రేస్ గ్రకోనాయంగ్, నైరోబి ఆల్డర్‌మన్ ఎన్. కల్గాలకు స్వాగతం చెప్పుతున్న నగర మేయరు శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి.



మార్చి 14న రాజభవన్‌లో గవర్నరును కలుసుకున్న నైరోబి మేయర్.



సమాచారశాఖ మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తిని ఫిబ్రవరి 26న కలుసుకున్న రష్యా జర్నలిస్టుల బృందం.



భారతదేశంలో ఇంగ్లాండు డిప్యూటీ హైకమీషనరు దేవిడ్ స్కాట్‌కు బేగంపేట విమానాశ్రయంలో మార్చి 22న స్వాగత మిచ్చినప్పటి చిత్రం.



భారతదేశంలో ఫ్రాన్స్ రాయబారి డీన్ దరిదన్‌కు బేగంపేట విమానాశ్రయంలో ఏప్రిల్ 2న స్వాగతం చెప్పుతున్న దృశ్యం.



ప్రిల్ 2న రాజభవన్‌లో గవర్నరును కలుసుకున్న ఫ్రాన్స్ రాయబారి డీన్ దరిడన్.



ఏప్రిల్ 4న ఆనంద నిలయంలో ముఖ్యమంత్రిని ఫ్రాన్స్‌రాయబారి డీన్ దరిడన్ కలుసుకున్నప్పటి చిత్రం.



ఎ. ఐ. సి. సి. అధ్యక్షుడు శ్రీ కె. కామరాజ్ మార్చి 31న హైదరాబాదు ఫతేమైదాన్ స్టేడియంకు స్వర్గీయ లాల్‌బహదూర్‌శాస్త్రి పేరున నామకరణం జరిపినప్పటి చిత్రం.



హైదరాబాదులో మార్చి 17న కాలేజ్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్ ప్రత్యేక స్నాతకోత్సవంలో ఉపన్యసిస్తున్న ముఖ్యమంత్రి.

---



సైఫాబాదు టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌కి సంబంధించిన 1600 టెలిఫోన్ లైన్లకు మార్చి 26 వ ప్రారంభోత్సవం జరిపిన ముఖ్యమంత్రి.



బేగంపేటలో మార్చి 30 న అఖిల భారత పౌర విమానయాన శాఖ సిబ్బంది సమావేశానికి కేంద్ర పౌరవిమానయాన శాఖ, రవాణాశాఖ మంత్రి డా. ఎన్. సంజీవరెడ్డి ప్రారంభోత్సవం జరిపినప్పటి చిత్రం.



మార్చి 3 న మెడికల్ సైన్స్ ఇనిస్టిట్యూట్ వార్షికోత్సవంలో ఉపన్యసిస్తున్న ముఖ్యమంత్రి.



శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి బహుమతుల్ని పంచిపెడుతున్న దృశ్యం.



మార్చి 2 వ తేదీన గృహ విజ్ఞానశాస్త్ర కళాశాల వార్షికోత్సవ సందర్భంలో ఉపన్యసిస్తున్న ముఖ్యమంత్రి.



సంగారెడిలో మార్చి 28 న యునెసెఫ్ సహాయంతో నెలకొల్పబడిన పాల శీతలకేంద్రానికి ప్రారంభోత్సవం జరుపుతున్న ముఖ్యమంత్రి.

## సమాచార శాఖవారిచే ఏర్పాటు చేయబడిన సాంస్కృతిక ప్రదర్శనలు



మార్చి 8 న రవీంద్రభారతిలో సితార్ కచ్చేరీ జరిపిన ప్రఖ్యాత సితార్ విద్వాంసుడు పండిట్ రవిశంకర్. ఈ కార్యక్రమాన్ని సమాచార, పౌరసంబంధ శాఖ ఏర్పాటు చేసింది.



రవీంద్ర భారతిలో ఫిబ్రవరి 19 న శ్రీ వేదాంతం సత్యనారాయణ బృందం 'ఉషా పరిణయం' అనే కూచిపూడి నృత్యనాటికను ప్రదర్శిస్తున్న దృశ్యం



మార్చి 31న గాంధీభవన్ లో 'కుశలవవిజయం' హరికథ చెప్పిన నర సాపుర నివాసి కవి కథకరత్న శ్రీ దీక్షితదాసు. ఈ సందర్భంలో పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి శ్రీ టి. వి. రాఘవులు ఉపన్యసిస్తున్న దృశ్యం.



రవీంద్రభారతిలో మార్చి 22న హిందుస్థానీ సంగీత కచ్చేరీ జరిపిన శ్రీమతి హీరాబాయి బరోడ్కర్.



రోటరీ క్లబ్బువారు ప్రారంభించిన 'ఐ బ్యాంకు'కు హైదరాబాదులో ఏప్రిల్ 3 న ప్రారంభోత్సవం జరుపుతున్న ముఖ్యమంత్రి

# బారను పొగాకును అమ్మకమునకు తయారుచేయుట

ఆంధ్ర ప్రదేశ్‌లోని గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాలలో ఫిబ్రవరి ఒకటవ తేదీనుండి బారను పొగాకు కొనుగోలు ప్రారంభించబడెను. పొగాకు పండించు ప్రతిరైతు తన పొగాకును అమ్మజూచుటకు ముందు ఈ క్రింది జాగ్రత్తలు తీసుకొనవలెను.

1. దొర్లింపు బేరములో ఆకు నాణ్యతను వివిధ గ్రేడుల శాతమును అంచనా వేయుట కష్టము. అందువలన పొగాకును గ్రేడు చేయకుండా దొర్లింపు బేరముగా అమ్మిన తక్కువధర లభించును.

2. ఆకు నాణ్యతను బట్టి కాంతి వంతమయిన మొదటి గ్రేడు ఆకు, మధ్యరకపు గ్రేడు ఆకు, గ్రీను, మొద్దు, పచ్చ మరియు గుల్ల గ్రేడులలోనికి పొగాకును గ్రేడు చేయవలెను.

3. "IV" అనబడు కాంతి వంతమయిన మొదటి గ్రేడు ఆకునందు గ్రీను కలియకుండా జాగ్రత్త వహించవలెను. ఆకులో కొంత భాగము కాంతివంతముగా యున్ననూ స్పాంజి అంచు మాడు యున్న ఆకులను ఇందులో చేర్చరాదు.

4. మండెలపైన గ్రేడు చేయబడిన ఆకుకట్టలపైన నీరు చల్లకూడదు. అటుల చేసినచో కొనుగోలుదారు అట్టి పొగాకును కొనుటకు నిరాకరించును.

5. "గ్రీన్నును" లేతఆకుపచ్చ, ఆకుపచ్చ మరియు మొద్దుపచ్చగా విభజించి విడిగా బేలు చేయవలెను.

6. మండెలలో మూడు నాలుగు దినము లుంచిన పిమ్మట పొగాకును గ్రేడు చేయుట మంచిది. ఆకు నాణ్యత క్షీణించును కాబట్టి పొగాకును ఎక్కువకాలము మండెలలో ఉంచకూడదు.

టొబాకో ఎక్స్‌పోర్టు ప్రమోషన్ కౌన్సిల్,

123, మౌంటురోడ్డు, మద్రాసు-6

# బతికిన కాలేజి

పాలగుమ్మి పద్మరాజు

సీరియల్ **13**

## జరిగిన కథ

పెద్దలకు నచ్చక పెళ్ళిచూపు లాగినా అబ్బాయి పట్టామాత్రం అమ్మాయి రాధనే పెళ్ళి చేసుకోవాలని అనుకొని, స్నేహితుడు చింతా సలహాతో తండ్రిని ఒప్పిస్తాడు. పెళ్ళిపీటలమీద పెళ్ళికూతురు రాధ కాకపోగా, విరాగియై తిరిగి ఇంటికి వస్తాడు. రాధా, కల్యాణీ శర్మగారివద్ద నాట్యము నేర్చుకొని రామలింగయ్య సహాయంతో ప్రదర్శన ఇస్తారు. చింతా, పట్టా దీనికి వస్తారు. రామలింగయ్య, అనుకున్న విధంగా డబ్బు ఇవ్వక పోయేసరికి, ప్రదర్శనచివరన వాదన జరుగుతుంది. పట్టా రాధను కలుసుకొనడానికి గ్రీన్‌రూమ్‌కె వెళ్తాడు. అక్కడ కామన్నచేత తీవ్రంగా దెబ్బలుతినిన పట్టా, చింతా సలహాపై ఘుంజుకుని కామన్న నో పట్టుతో ఓడించేస్తాడు.

మిస్టర్ చింతా హెచ్చరిక అవసరమే లేక పోయింది పట్టా, పట్టుతోటే కామన్నకి యుద్ధంమీద మోజు పూర్తిగా పోయింది. దానికి తోడు కారు లైట్లలో కనబడ్డ మిస్టర్ చింతా తోట చూసిన దగ్గర్నుంచీ అతను నోరు తెరుచుకునే కూచున్నాడు. నోరు తెరుచుకునే ఇంట్లో అడుగు పెట్టాడు. లోపల ప్రవేశించగానే నోటితోబాటు అతని కళ్ళుకూడా పెద్దవయ్యాయి.

కామన్న ఇలాంటి పూలతోటా, ఇల్లూ, ఎక్కడో విదేశీపత్రికల్లో చూశాడంతే.

మిస్టర్ చింతా వాళ్ళని ఏయిర్‌కండిషన్ చేసిన తన గదిలోకి తీసికెళ్ళాడు.

చల్లని గాలి సరిగిపోయిన నరాలకి తగలగానే. నిలబడిఉండగానే మహా సుఖమైన నిద్ర వొచ్చింది కామన్నకి. చటుకుని చేతికి దొరికిన కుర్చీని పట్టుకుని మెల్లగా అందులోకి జారాడు. హాయిగా ఎక్కడో అధోలోకంలోకి దిగిపోయింది కుర్చీ మెత్త. ప్రతి అవయవానికీ అతి మెత్తగా అతి హాయిగా, అతి చల్లగా తగిలింది కుర్చీ. కుర్చీలింత మెత్తగా ఉంటాయని అతని కసలు తెలీదు.

మిస్టర్ చింతా టీ కలుపుతూ, జరిగిన పొరబాటు అతి క్లుప్తంగా వివరించాడు. అదంతా కామన్నకి వివరంగా చెవికి ఎక్కకపోయినా, ముఖ్యమైన విషయాలు అర్థమయాయి.

"కొంచెం టీ?" అన్నాడు మిస్టర్ చింతా తొంభై ఎనిమిదోసారి.

"వొద్దు," అన్నాడు కామన్న తొంభై ఎనిమిదోసారి. అతను ఆసనాలు మొదలు పెట్టిన దగ్గర్నుంచీ, 'యోగాసనములు' పుస్తకం ఉపోద్ఘాతంలో రాయబడ్డ ప్రకారం కాఫీ, టీలు తాగలేదు, చుట్టా, సిగరెట్ ముట్ట లేదు.

"మిస్టర్ కామన్నా! జరిగింది అది. మా పట్టా నిజానికి చాలా మర్యాదైన పని చేశాడంటాను, తన కిష్టంలేని పిల్లమెడలో తాళిగట్టి, ఆమె జీవితం తన జీవితం నరక ప్రాయం చేసుకోడానికి నిజాయితీగల యువకు డెవడన్నా ఒప్పుకుంటాడా? పరిస్థితులు కుట్రపన్నాయి అ కుట్రలో రెండు అమాయిక జీవితాలు చిక్కుబడిపోయాయి-రెండేమిటి మూడు-మిస్టర్ కామన్నా, ఒక చిన్న కప్పు టీ..."

తొంభై తొమ్మిదోసారి మిస్టర్ చింతా టీ ఇవ్వబోయేసరికి. కామన్న ఓర్పు పటాపంచలైపోయింది. తెగించి ఆ కప్పు మిస్టర్ చింతా చేతిలోంచి లాక్కున్నాడు. ఒక్క గుక్కలో తాగేశాడు. అలిసిన నరాల్లోకి ఏదో అమృతం ప్రవహించి నట్టుంది కామన్నకి. మళ్ళీ తనే కప్పు నింపుకుని రెండో కప్పు తాగేశాడు. మూడో కప్పు సగం తాగాక తన ప్రవర్తన కాస్త వింతగా ఉందేమో నన్న అనుమానం తగిలిందతనికి.

"నే నీ ఆసనాలు మొదలుపెట్టిన దగ్గర్నుంచీ, కాఫీ టీలు తాగలేదు, పదేళ్ళు పైనయింది టీ రుచి చూసి..." అన్నాడు క్షమార్పణ చెప్పుకొంటున్నట్టు.

"ఈ పదేళ్ళ టీ ఇప్పుడు తాగుతానంటే మా ఇంట్లో స్టాక్‌లేదు," అన్నాడు మిస్టర్ చింతా. కామన్న నవ్వాడు.

"అంచేత నిజానికి మా పట్టు ప్రవర్తన -వింతగా ఉండొచ్చు గాని, గర్హించవలసినది గాని, అసహ్యించుకో వలిసినదిగాని కాదు. అతను దుర్మార్గుడని ఎవరూ అన లేరు." అన్నాడు మిస్టర్ చింతా.

పట్టా దుర్మార్గుడు కాడన్న సంగతి కామన్నకి ఎప్పుడో అర్థమైంది. తనవంటి బలవంతుణ్ణి ఎలకపిల్లని పట్టినట్టు సునాయసంగా పట్టేసిన పట్టా అసలు దుర్మార్గుడెలా అవుతాడు.

"కాని మా వాళ్ళకి నచ్చజెప్పడం ఎల్లాగా అని," అన్నాడు కామన్న.

"లీవిట్ టు మిస్టర్ చింతా, మిస్టర్ చింతాకి వొదలిపెట్టండి. నేనొక పథకం ఆలోచించాను. మిస్టర్ కామన్నా! సిగరెట్?" అంటూ బంగారు కేసొకటి తెరిచాడు మిస్టర్ చింతా. కామన్న ఒకటి తీసి నోట్లో పెట్టుకున్నాడు. మిస్టర్ చింతా లైటర్ వెలిగించాడు. ఒక్కదమ్ము పీల్చాడు

కామన్న. ఆ మత్తులో సుఖం తమజన్మలో ఎప్పుడూ చవిచూడలేదనిపించింది కామన్నకి. మెల్లిగా తల కుర్చీవెనక మెత్తకి ఆన్చి మరోసారి తృప్తిగా పీల్చాడు. సిగరెట్టు సగంవరకూ కాలిపోయింది. మిస్టర్ చింతా ఆ రెట్టకిందపడి కుర్చీనో, తివాసీనో ఖరాబు చెయ్యకుండా దానికింద తొడుపుగా ఆష్ట్రే పెట్టాడు.

"రేపొద్దున్న ఎనిమిది గంటలకి మీ లాడ్జికి వస్తున్నా," అన్నాడు మిస్టర్ చింతా.

ఇంక కామన్నగాని, పట్టూగాని తను చెప్పేవి ఏవీ వినేస్థితిలో లేరని గ్రహించాడు మిస్టర్ చింతా. ఇద్దర్నీ కేవలం తన బలవంతంమీద లేవదీసి, కార్లో కూచోబెట్టాడు.

కారు లాడ్జికి కొంచెం దూరంలో ఆపి కామన్నని దింపాడు. ఈ పన్నాగంలో తనకొక పాత్ర ఉన్నట్టు కల్యాణికీ, రాధకీ తెలిస్తే కథంతా ఎదురు తిరుగుతుంది. అంచేత కామన్న జబ్బలు రెండూ పట్టుకుని ఊపి అతన్ని కాస్త మేలుకొలిపి అన్నాడు.

"మరిచిపోవద్దు. రేపు పొద్దున్న ఎనిమిది గంటలకి. ఈ రాత్రి మీరు మా అతిధిగా ఉన్నట్టుగాని, పట్టూ మీరు కలిసి మా యింట్లో టీ తాగినట్టుగాని మీ చెల్లెళ్ళకి తెలియడానికి వీల్లేదు. తెలిస్తే పథకమంతా బెడిసికొడుతుంది. తెలిసిందా? గుడ్ నైట్."

మిస్టర్ చింతా చక్రుని కారు తిప్పి వెళ్ళిపోయాడు.

కామన్న ఇంటి గుమ్మందాకా బ్రహ్మప్రయత్నంమీద నడిచాడు. మెట్లు కనపడగానే ఇంక నిలబడలేక కూచున్నాడు. చల్లని గాలి. పక్కఇంటి నైట్ క్వీన్ వాసనని మత్తుగా మోసుకొచ్చింది.

కామన్న హాయిగా మెట్లమీదే నిద్రపోయాడు.

నిద్రలో అతనికి ఒకటే కల.

ఆ కలలో, పట్టూ ప్రయోగించినట్టు కామన్న అతి ఉత్సాహంగా ప్రాక్టీస్ చేస్తున్నాడు.



ఆ సమయంలో బీట్ పోలీసు ఎంకటసామి—ఎంకటసామి—ఆ దారిన రావడం దురదృష్టం. అంటే ఎంకటసామి దురదృష్టం.

ఎంకటసామి చూశాడు. కామన్న విజయోత్సాహంలో ఏదో తెలియనిభాష మాట్లాడుతూ చేతులు అతి విచిత్రంగా తిప్పుతున్నాడు. ఎంకటసామికి అనుమానం వచ్చింది. ఆ తరవాత కోపమొచ్చింది. ఆరాత్రి డాన్సుచేసిన అమ్మాయిలిద్దరూ ఆ ఇంట్లో మకాంచేస్తున్నారని అతనికితెలుసు. ఈ అవతారాన్నీ అతని చేష్టలనీ చూస్తూంటే ఎంకటసామికి ఒళ్ళు మండింది. కామన్న గుడ్డలంతా దుమ్మైపోయి ఉండడం, జుట్టంతా చెరిగిపోయి ఉండడం, సగం మగతగా ఏదో గొణగడం: చేతులతో దేన్నో పట్టుకుని కసిగా నలిపివేస్తున్నట్టుండడం—అంతా చూసేసరికి, అత నే

తాగుబోతో, ఆ అమ్మాయిల్ని అల్లరి పెట్టడానికి వొచ్చాడని ఎంకటసామి అనుకున్నాడంటే, అది అతని తప్పుకాదు.

"ఏయి." అన్నాడు దెగ్గరికొచ్చి ఎంకటసామి.

"చాల్లేవోయి." అన్నాడు సగం మగతలో కామన్న —

"ఏయి," అంటూ అతన్ని పట్టుకుని లేవదీయబోయాడు ఎంకటసామి.

"దొరికావు," అంటూ అతన్ని వెనక్కు తిప్పి. పట్టూ పట్టు అతని మీద ప్రయోగించాడు కామన్న. కీచుమన్నాడు ఎంకటసామి. అతని నరాలు నసాళందాకా లాగేశాయి. కామన్నకి కలా నిజం కలిసిపోయాయి. అతను పట్టు మరికాస్త బిగించాడు.

"బాబోయి నన్నొదులు.'' అన్నాడు ఎంకటసామి.

"అన్నయ్యా!" అని అరిచింది గుమ్మంలో నుంచుని రాధ ఈ గొడవ విని ఆమె లేచొచ్చింది,

రాధ గొంతుక వినగానే వొదిలేశాడు కామన్న; అతని ఎదటఉన్నది గామా ఫైల్వాన్‌కాదు, పోలీసు జవాను. ఇంతవరకూ గామాతో కుస్తీ పడుతున్నానని అతని నమ్మకం.

అతను నీరసంగా చతికిలపడిపోయాడు. పాపంపోలీసు ఎంకటసామికీ నడివయస్సు దాటింది. అతనూ కూచున్నాడు, మణికట్లు రాసుకుంటూ.

"ఎక్కడికెళ్ళావు ఇంతవరకూ?" అంది రాధ.

''పోలీసుతో ఎందుకొచ్చిందితగాదా!" అంది కల్యాణి.

చెప్పవలసింది భారతమంత కథుంది. అది అంతాచెప్పినా వాళ్లు నమ్ముతారో లేదో అన్న అనుమానం ఒకటుంది కామన్నకి. అంచేత ఎంకటసామివంక తిరిగి.

"పొరబాటు, నువ్వనుకోలేదు," అన్నాడు క్షమార్పణ పూర్వకంగా,

"పరవాలేదయ్యా" అన్నాడు ఎంకటశామి. ఈ ఆసామీ ఆపిల్లల అన్నగారని అర్థమైపోయిందతనికి.

"పరవాలేదండి; పెద్దపెద్దోళ్ళ కందరికీ ఉన్నాదయ్యా ఈ యలవాటు. ఒకతూరి అలవాటైతే ఇంక ఒదల్దు."

"ఏం అలవాటు?" అన్నాడు కామన్న నిజంగా అర్థంకాక.

"నిన్నగాక మొన్నండమ్మా మంచి కొత్తసూటేసుకున్నా డండి, ఓపెద్ద మనిషి. మురుక్కాలవలో పడుకోని నిద్రపోతున్నాడు. అటువంటి పెద్దోళ్ళమీద రిపోట్రు రాత్తానండిమరి. బాబుగారు! మీ రేద పండుకున్నాగానండి, ఇంటిగుమ్మాలమీద మాత్రం ఒద్దండి. ఎందుకంటె, ఇల్లుగల ఆసామీ రిపోట్రిచ్చాడంటే మేమేం చెయ్యలేం—"

"లేదు — నేను ... లేదు," అన్నాడు కామన్న. తను తాగలేదని నిష్కర్షగా చెపుదామనుకున్నాడుగాని, చెల్లెళ్ళ మొగాలు చూడగానే, తనేం చెప్పినా వాళ్లు నమ్మరని అతనికి అర్థమైపోయింది. నిట్టూర్చి అతను లోపలికి వెళ్ళిపోయాడు.

రాధ ఎంకటస్వామికి పదిరూపాయ నోటివ్వబోయింది.

"అమ్మో! వొద్దుతల్లీ. మీదగ్గ రుచ్చుకుంటానాతప్పుగాదూ? అమ్మా! నాఅదుట్టం బాగుంది పన్నెండుదాకా మనహాలుకా దేశారండి నాడూటీ గేటోణ్ణి మంచమాట జేసుకోని లోనకొచ్చి కూసున్నా. ఏండాస్సమ్మా తల్లీ! కళ్ళు జిగేల్ మన్నాయి — దయుంచండమ్మా. ఈతూరి మల్లా ఈఊళ్ళో ఆటేత్తేమట్టుకు కాంత గురుతుంచుకోండి. అమ్మా — అన్నయ్యగారి మొగంమీద తడిగుడ్డేసి తుడవండి. తిక్క దిగిపోతాది."

ఎంకటసామి వెళ్లిపోయాక అక్కచెల్లెళ్ళిద్దరూ కామన్న పడుకున్న మంచం దగ్గరకు వెళ్లి చూశారు. కళ్ళు మూసుకునే దొర్లుతున్నాడు కామన్న. హఠాత్తుగా అతనికి అలవా టెలా పట్టుకుందో వాళ్ళకి అర్థం కాలేదు నిట్టూర్చి ఇద్దరూ తమతమ పక్కలమీదికి వెళ్లి నడుములు వాల్చారు.

ఆరాత్రి ఇంక అముగ్గురికీ నిద్రపట్టలేదు.

ఈ అపోహ ఎల్లా తొలగించాలని కామన్న ఆలోచిస్తున్నాడు.

డాన్సు ఎంత విజయవంతంగా ముగిసినా, ఆ తరవాత పట్టం — అంటే పట్టూ పూలచెండు పట్టుకురావడం, ఆ తరవాత కామన్న అతన్ని పట్టుకోవడం, కామన్న తాగేసిరావడం, అన్నీ అప్పచెల్లెళ్ళ విద్దర్నీ మహాకలత బెట్టేశాయి.

* * *

రాధ మంచం కిటికీ పక్కనుంది. ఏ తెల్లవారుజామునో ఆమెకు కోడికునుకు పట్టింది ఎంత వద్దనుకున్నా ఆమెకు కలలో పట్టూ కనబడుతూనే ఉన్నాడు. కలలో అతన్ని ఆమె ఈసడిస్తూనే ఉంది.

"రాధా! రాధా!" అంటూనే ఉన్నాడతను.

"నాతో మాట్లాడకు. వెళ్ళిపో—నీమొహం నేనుచూడను,'' అంటూనే ఉందామె. అతను దిగాలుపడి, కుంచుకుపోయిన భుజాలతో, వంచినతలతో వెనక్కు తిరిగి వెళ్ళిపోతున్నాడు. కాని అతనిముఖం మళ్ళీ మళ్ళీ ఆమెయెదట ప్రత్యక్షమౌతోనే ఉంది. అందులో ఏదోదిగులు, ఆవేదన ఆమెను కలతపెడుతూనే ఉన్నాయి. అంచేత 'రాధా!' అన్నపిలుపు కిటికీ అవతలనుంచి వినపడ్డప్పుడు, అదికూడా కలలో భాగమే అనుకుందిరాధ. 'రాధా,' అన్న పిలుపులో ధ్వనించిన బాధ ఆమె మనస్సంతా కలచివేసింది.

"పో," అంది మంచంమీద రెండో పక్కకి ఒత్తిగిల్లుతూ, ఆమెకు తెలియకుండానే ఆమెకళ్ళు చెమ్మగిల్లుతున్నాయని ఆమె అనుమానం, కలలో.

''మెలకువగానే ఉన్నావా?" అన్న మాటలు ఆమెను మేలుకొలిపాయి, లేచి కళ్ళు నులుపుకుని ఆశ్చర్యంగా చూసింది.

"రాధా!" అన్నాడు పట్టూ అవతల నుంచి.

"నువ్వా!!" అంటూ రాధ కిటికీతలుపు మూసింది. కిటికీఅవతలనించి నిట్టూర్పు వినిపించింది.

రాధ పట్టూనేకాదు, అతని చేతులోఉన్న పుస్తకాన్ని చూసింది. "హృదయ కుసుమాలు!" ప్రేమశ్రీ రాసిన కొత్తనవల!! ఆమె మెల్లగా కిటికీతలుపు తీసింది — కిటికీ కింద నేలమీద చతికిలబడి పట్టూ నవల చదువుతున్నాడు.

'ఇంత కోమలశరీరంలో ఇంత శిలా కాఠిన్యం ఎందుకుపెట్టాడు భగవంతుడు? నాహృదయకుసుమం నీ చేత పెట్టాను దాన్నిలా నిర్దాక్షిణ్యంగా నలిపి ధూళిపాలు చెయ్యడం న్యాయమేనా? నీవు నాకు ఏకైక దేవతవు. నాప్రాణాలు సైతం అర్పించి నిన్ను ఆరాధిస్తాను. నీవు నన్నెంత ఈసడించినా, నీపాదాలు నేను వదలలేను. నా సర్వస్వం నీకుసమర్పించి నే నీ దుర్భర జీవితాన్ని అంతమొందిస్తాను. మృతితోనే నాకింక ముక్తి."

రాధగుండెలు గొంతుకలో కొట్టుకున్నాయి.

"ఏవిటే చూస్తున్నావు?" అంటూ దగ్గఱకొచ్చింది కల్యాణి.

రాధ దుఃఖం ఆగక అక్కణ్ణించి వెళ్ళిపోయింది. కల్యాణి తొంగిచూసింది. ఆమెను సిగ్గూ, అవమానంరోషం ఆవహించాయి.

"అన్నయ్యా," అంటూ గబగబా వెళ్ళింది కళ్యాణి

కామన్న అతికష్టగా వేస్తున్నాడు శీర్షాసనం; కష్టగా ఎందుకు వెయ్యవలసి వచ్చిందంటే, రాత్రి కుస్తీ అనంతరం అతని అవయవాలు స్వాధీనంలో లేవు. గోడ ఆసరా లేకండా తలమీద నిలబడ్డం కష్టమైపోయింది. అంచేత గోడ దగ్గరగా తల కిందపెట్టి, మెల్లగా నడుం ఎత్తి కాళ్ళుపైకి సాచాడు. అప్పుడొచ్చింది కల్యాణి తలుపు తోసుకుని.

"వాడొచ్చి మళ్ళీ కిటికీకింద కూచున్నాడు," అంది.

"ఎవడు?" అన్నాడు కామన్న.

"వాడే... నిన్నరాత్రి..."

"ఓహో!" అన్నాడు కామన్న, ఏదో మామూలు విషయం విన్నట్టు. ఆ ముక్క వినడంతోటే, మేకమీది కురికే పులిలాగ తొడ చరిచి కామన్న బయలుదేరతా డనుకుంది కల్యాణి. అతను తన కేం సంబంధం లేదన్నట్టు శీర్షాసనంలోనే ఉండిపోయేసరికి కళ్యాణికి ఆశ్చర్యం వేసింది. రాత్రి అతని నడవడి, బోసీ ఏదో తాగుడువల్ల అని అనుకున్నా, ఇప్పు డతని నిర్లక్ష్యం దేనివల్లో ఆమెకు అర్థం కాలేదు. కామన్నకేమీ మతి చలించలేదుగదా? నిన్నరాత్రి నడవడికీ, ఇప్పటి నడవడికీ సంబంధం ఏమన్నా ఉందా? రెంటికీ ఒకేకారణం వెతకాలంటే, మతిభ్రమ తప్ప మరొకటి కనబడ్డంలేదు.

కల్యాణి దభాలున తలుపు మూసి ఇవతలికి వచ్చింది. రామలింగయ్యగారు పొద్దున్నే లేచి బయటికి ఎక్కడికో వెళ్ళారు.

కల్యాణి నిట్టూర్చి పడకగది తలుపు తోసింది. అక్కడిదృశ్యం ఆమెకు మరింత ఆశ్చర్యం కలిగించింది.

రాధ చేతులోంచి 'హృదయ కుసుమాలు', మంచంకిందికి వేళ్ళాడుతోంది. ఆమెముఖం తలగడాలో దాచి వెక్కి వెక్కి ఏడుస్తోంది. కల్యాణి దగ్గరగా వెళ్ళి రాధని నిమిరింది. రాధ లేచి "అక్కయ్యా," అంటూ కల్యాణిని కౌగలించుకుని ఏడవడం మొదలుపెట్టింది.

"ఎందుకే రాధా: ఏవిటిది?"

రాధ కాస్త ఏడుపు దిగమింగుకుంది,

"ఏమీలేదే, ఈ నవలలో సురేన్, మీనాని పట్టుకుని నానామాటలూ అంటుంటే, నాకు ఏడుపొచ్చింది," అంది.

ఇదివరకూ ఈ కథల్లో నాయికా నాయకుల సుఖ దుఃఖాలు పంచుకునేది రాధ. అయితే ఇల్లా వెక్కి వెక్కి ఏడవడం మాత్రం ఎప్పుడూలేదు. ఏమనుకోవాలో ఏమీ అర్థం కాలేదు కల్యాణికి. అందుకే ఒక్కసారే మతి భ్రమించిందా?

"లే. ఊఁ!" అందొక గొంతు కిటికీ అవతల, కల్యాణి కిటికీదగ్గర కొచ్చింది. పట్టూని రెండు జబ్బలూ పట్టుకుని బలవంతంగా అవతలికి తోసుకుపోతున్నాడొక యువకుడు. ఏదో పురుగుని దూరంగా ఒంటికి తగలకండా పట్టుకుపోయి, అవతల పారేస్తున్నట్టు యువకుడి ధోరణి చూస్తే, అతను తన బట్టలు నలక్కండా, దుమ్ము కాకండా. జాగర్త పడుతున్నట్టు అనిపించింది కల్యాణికి. అది నిజంకూడా. ఎందుకంటే మిస్టర్ చింతా దుస్తులు ఎక్కడా మడత నలగలేదు. కల్యాణి మనస్సు కాస్త కుదుటపడింది. ఎవరో పెద్దమనిషి ఈ పీడన్నా తొలిగించాడు.

రోడ్డుమీద కొంచెం దూరంలో నిగనిగ మెరుస్తున్న కారొకటి నిలబడిఉంది. కారు తలుపుతీసి పట్టూని అందులోకి తోసి తలుపు మూశాడు మిస్టర్ చింతా. డ్రైవరుతోటి ఏదో అన్నాడు; కారు కదిలిపోయింది.

కల్యాణికి మరొక ఆశ్చర్యకరమైన విషయం.

తమకి పట్టూపీడ వదిలించిన పెద్దమనిషి తిరిగి ఇంట్లోకి వస్తున్నాడు.

"రాధా! లే — ఆయనెవరో వొచ్చాడు, మన్ని చూడ్డానికికాబోలు."

రాధ కదల్లేదు; కల్యాణి అవతలికి వెళ్ళింది

మిస్టర్ చింతా కుర్చీ జేబురుమాలుతో దులువుతున్నాడు, కల్యాణిని చూడ్డంతోటే వంగినవాడు లేచి నిలబడ్డాడు.

"గుడ్ మార్నింగ్... మిస్ వాణి?..." అన్నాడు.

కల్యాణి మొదట తెల్లబోయింది. తన పేరు వాణిగా మార్చినట్టు ఆమె మరిచిపోయింది. వెంటనే ఆమెకు గుర్తుకొచ్చింది.

"అవునండి, అంటే... కూచోండి."

అసలు పేరు చెపుదామనుకుని మళ్ళీ వొద్దనుకుంది కల్యాణి. మిస్టర్ చింతా చిరునవ్వు నవ్వుతూ అలాగే నిలబడ్డాడు. కల్యాణికళ్ళల్లోకి రెప్పవాల్చకుండా చూస్తూ. తన మనస్సులో రహస్యాలేవో అతను పట్టి వేస్తున్నట్టు అనిపించింది కల్యాణికి.

"కూచోండి,'' అంది మళ్ళీ.

"మీరు ముందు కూచోవాలి. లేడీస్ ఫస్ట్," అన్నాడు మిస్టర్ చింతా.

అతని మాటల్లో జులాయితనం కాకపోయినా కొంటెతనం ఏదో వుందనిపించింది కల్యాణికి. కొంచెం చికాకుపడింది. అయినా కూచుంది.

"నాపేరు మిస్టర్ చింతా," అన్నాడతను కూచుంటూ.

"చాలా థాంక్స్. అతనెవరో ... మమ్మల్ని వొదిలిపెట్టడంలేదు. నిన్నరాత్రి నించీ పీడించుకుతింటున్నాడు," అందామె.

"పట్టూ అని ... ఈవూరే...,'' అని ఆమెవంక చూశాడు. ఆమెముఖం వంచేసుకుంది. మిస్టర్ చింతాకి అర్థమైపోయింది. పట్టూ ఎవరో ఆమెకు అర్థమైందన్నమాట.

"ఏదో తనపెళ్ళి - అనంతం తనే చెడగొట్టుకున్నాట్ట. అప్పటినించీ ఇలా పిచ్చెక్కినట్టు తిరుగుతున్నాడు. తల్లిదండ్రులకి ఒక్కడే కొడుకు పాపం. కొంచెం తెలుసు నాకు. వాళ్ళ ఇంటిదగ్గర దిగబెట్టి రమ్మన్నా మా డ్రైవర్ని. గుడ్‌బాయ్. మంచివాడే పాపం."

మిస్టర్ చింతా నిట్టూర్చాడు. కల్యాణి ఏం మాట్లాడలేదు. విషయం మార్చి తనొచ్చిన పని చెపుతాడేమో నని ఎదురు చూస్తోంది కల్యాణి. కాని మిస్టర్ చింతా ఆ విషయం వొదిలిపెట్టలేదు.

"పాపం, అతనేం మాట్లాడుతున్నాడో అతనికే తెలియదు. ఎవర్నో ప్రేమించానంటాడు. అకస్మాత్తుగా పెళ్ళిపీటలమీద పెళ్ళికూతురు మారిపోయిందంటాడు. తనెంకో అమ్మాయికి అన్యాయం చేసినా, ఏమీ అని చెయ్యలేదంటాడు. నే చెప్పా—అన్నాయి, ఇలా కిటికీలకింద కూచుని వెర్రి మొర్రి వేషాలు వేస్తే, ఏ పోలీసన్నా చూస్తే బాగుండదు. ఇంటికిపో, అన్నాను, ఎలాపోను. నా ప్రేయసి ఆ గదిలో ఉంది', అన్నాడు. 'అయితే లోపలికి వెళ్ళిమాట్లాడు,' అన్నాడు. 'ఆమె నాతో మాట్లాడనంది,' అన్నాడు. అయితే తక్షణం ఇక్కణ్ణించి వెళ్ళిపోవాలి నువ్వు. ఆడపిల్లని అల్లరిపెట్టినట్టౌతుంది, నువ్విక్కడింకా అంటిపెట్టుకుని ఉంటే. వెడతావా, బలవంతగా వెళ్ళగొట్టమంటావా?' అన్నాను. అయినా అతనిమీద జాలేసింది. ఏదన్నా గొడవైతే పదిమందిలోనూ తను తలెత్తుకు తిరగ్గలడా ఈఊళ్ళో? ఆ మాత్రం కూడా అతను లక్ష్యపెట్టకుండా పిచ్చివాడిలా ఇక్కడిలా కూచున్నాడంటే..." మిస్టర్ చింతాకావాలనే ఈ వాక్యం పూర్తి చెయ్యలేదు. తలుపుచాటునించి ఇదంతా రాధ వింటూందని అతను గ్రహించాడు. ఆమె వినాలనే అతను ఇంత వివరంగా పట్టూని గురించి ప్రస్తావించాడు. అయినా అతని పక్షాన్ని వాదిస్తే అసలు పన్నాగం అంతా చెడిపోతుంది. ఇద్దరూ ఒకటేనన్న సంగతి వాళ్ళకి ఇప్పుడప్పుడే తెలియకూడదు,

"మిస్‌రాణి... ఇంకా లేవలేదా?" అన్నాడు మిస్టర్ చింతా.

"లేచింది... లోపలుంది," అంది కల్యాణి.

మిస్టర్ చింతాని మొదట చూడగానే, అతనేదో రౌడీ రకమనీ, తమ డాన్సుని గురించీ, అందచందాలని గురించీ అతిగా పొగిడి, లేనిపోని చనువు తమతో కల్పించుకుంటాడనీ కల్యాణి భయపడింది. ఇంతవరకూ ఆ ప్రస్తావనే అతను తీసుకురాకపోవడం వల్ల ఆమెకు ఒకరకంగా ఆదుర్దా తగ్గినా, మరోరకంగా కాస్త అసంతృప్తిగా ఉంది. ధైర్యం చేసింది కల్యాణి.

"నిన్న మా డాన్సుకొచ్చారా?'' అంది. వెంటనే ఇంత సాహసాని కొడిగట్టినందుకు లోపలే మలచుకు పోయింది. ఎందుకంటే ఈ పెద్దమనిషి ఒకవేళ డాన్సు చూసినా, క్రితంరాత్రి మిగతా అభిమానులంతో బాటు లోపలికొచ్చి వాళ్ళని అభినందించలేదు, అంటే ఒకవేళ తమడాన్సు చూసినా, దాని విషయమై అతనంత ఎక్కువగా అనుకోలేదేమో. చూడకపోతే అసలు తన ప్రశ్నే అనవసరం. కాని తనప్రశ్నకి మిస్టర్ చింతా సమాధానం విన్నప్పుడు ఆమెకు మరింత ఆశ్చర్యం వేసింది.

"మీ డాన్సు చూడకపోతే, ఈవేళ మిమ్మల్ని కలుసుకోడానికెందుకొస్తాను?" అన్నాడు మిస్టర్ చింతా.

"హల్లో!" అన్నాడు కామన్న హాల్లోకి వస్తూ. మిస్టర్ చింతా గొంతువిని గబుక్కుని లంగోటీతోటే వొచ్చేశాడు ఇవతలికి.

"గుడ్‌మార్నింగ్. నాపేరు మిస్టర్ చింతా. తమపరిచయం కలగడం అదృష్టం. మీరు...," అని ప్రశ్నార్థకంగా ఆగాడు మిస్టర్ చింతా.

కామన్న బిత్తరపోయాడు. తన్నసలు ఎరగనట్టు మాట్లాడతాడేం? నిన్నరాత్రి అతనేగా ఇంటిదగ్గర దింపింది?

"మా అన్నయ్య,'' అంది కల్యాణి, ఆమాట చెప్పడానికికూడా కొంచెం సిగ్గుపడింది. ఎవరో ముక్కూమొహం తెలియని పెద్దమనిషి చూడ్డానికొస్తే, లంగోటీతోటి తగుదునమ్మా అని ప్రత్యక్షమవడమే గాదు, పెద్ద చనువుగా పలకరించడం ఒకటి.

"పంచెకట్టుకు రాకూడదూ?" అంది కల్యాణి చిరాకుగా. కామన్న కిందికి చూసుకొని "ఓ," అన్నాడు. దాని అర్థం ఏమిటో అతనికే తెలియదు. కాని తన గదిలోకి వెళ్ళిపోయాడు. కల్యాణి 'అమ్మయ్య' అనుకుంది,

"అతనికి ఆసనాల పిచ్చి." అంది. కామన్న ఆకారానికి క్షమార్పణ చెప్పుకొంటున్నట్టు,

"నాకు నాట్యకళంటే పిచ్చి. ప్రతి మనిషికీ ఒకొక్క పిచ్చి ఉంటుంది.

ఉండాలి. ఏ పిచ్చీలేని మనిషి బతకడం అనవసరం ... మీ కభ్యంతరం లేకపోతే ఒక చుట్ట..." అంటూ మిస్టర్ చింతా కోటుజేబులోనించి ఒక కారోనా తీసి వెనక పక్క అగ్గిపుల్లతో చిల్లు చేశాడు.

"కాల్చండి," అంది కల్యాణి.

"థాంక్స్! ఇదొక పిచ్చి నాకు. ఈ రకం చుట్టలు దొరక్కపోతే నాకు నిజంగా పిచ్చెక్కిపోతుంది."

మిస్టర్ చింతా అతి సున్నితంగా చుట్ట ముట్టించాడు. అతి సున్నితంగా రెండుసార్లు పొగ పీల్చి వదిలాడు. కుర్చీలో వెనక్కి జేర్లబడ్డాడు, తాపీగా. ఏవో సుఖ స్వప్నాలు కంటున్నట్టు. కల్యాణికి కంగారెక్కువైంది. ఇతను ఎందుకొచ్చాడో, ఎంత సేపుంటాడో ఏమీ తెలియడం లేదు. మని షెలాంటివాడో అంతుపట్టడం లేదు. పరాయి మొగాళ్ళతో మాట్లాడ్డమే కాదు, తను ఒక్కత్తీ కూచుని కూడా ఎరగదామె. ఏహో వంకబెట్టి లోపలికి వెళ్ళిపోదామని నిర్ణయించుకుని, బొత్తిగా అమర్యాదగా అనిపించకండా లేచి వెళ్ళడానికి సాకుకోసం వెతుక్కుంటోంది.

పట్టూ విషయం ఇంకా ఏమన్నా ఈ పెద్దమనిషి చెపుతాడేమోనని ఆశగా ఆత్రంగా తలుపుపక్క నిలబడ్డ రాధ, నిట్టూర్చి, తన మంచందగ్గరకు వెళ్ళబోతుంటే, ఆమె పైటచెరగు తలుపు గడియను పట్టుకుంది. తలుపు బర్రున తెరుచుకుంది. ఆమె నవనాడులూ సిగ్గుతో ముడుచుకుపోయాయి.

"మిస్ రాణి లేచినట్టున్నారు," అన్నాడు మిస్టర్ చింతా.

"రాధా!" అని పిలిచింది కల్యాణి.

"వారి పేరు మిస్ రాణీ కాదూ?" అని అడిగాడు మిస్టర్ చింతా,

తమ పేర్లు రామలింగయ్యా మార్చిన సంగతి కల్యాణి అనుక్షణం మరిచిపోతూనే ఉంటుంది, మిస్టర్ చింతా రెండోసారి ఈ పేరు గుర్తుతెచ్చేసరికి, కల్యాణికి అకారణంగా అందరిమీదా చిరాకుపుట్టుకొచ్చింది.

"మా అసలుపేర్లు కల్యాణీ రాధా. ఈ ప్రదర్శనంకోసం రామలింగయ్యగారు మార్చారు. రంగస్థలంమీదకి ఎక్కేవాళ్ళకి అసలుపేర్లు పనికిరావటగా!" అనేసింది కల్యాణి ఆవేశంతో, వెంటనే అంతధాటీగా అన్నందుకు సిగ్గుపడిపోయింది.

"రామలింగయ్యగారు మాకు మేనమామ వరస. వెనక నాటకాల్లో మంచిపేరు సంపాదించా రాయన. ఆయనే ఏర్పాటు చేశా రీ ప్రదర్శనం," అని సద్దిచెప్పింది, కొంచెం నేపాగి.

"పొద్దున్నే వెళ్ళారెక్కడికో," అంది కల్యాణి. ఏదోసాకు చెప్పి లేచి వెళ్ళిపోవాలన్న ఆలోచనకూడా ఆమె మనసులో అడుక్కుపోయింది. అకారణంగా ఆమె మోకాళ్ళు పట్లుతప్పాయి. ఆవేశంగా మాట్లాడి ఆపెద్దమనిషి సమక్షంలో తను వెలితిపడిపోయినట్టు అనుమానం ఆమెకు. అంచేత తనమీదా, ఆ పెద్దమనిషిమీదాకూడా చిరాకుగాఉంది. అతను వాగినంత వాగి విసుగెత్తి వెళ్ళిపోయిందాకా తను అలాగే పెదవి విప్పకండా కూచోవాలని తీర్మానించుకుంది. ఎవరో శనిగ్రహంలా వొచ్చి తన్ను ఒంటరిదాన్నిచేసి అక్కడ కూచోబెట్టేస్తే, కామన్నగానీ, ఆఖరికి రాధగానీ తనకి తోడు రాలేదు. రాధ తలుపుదాకా వొచ్చి లోపలికి వెళ్ళిపోయిందికూడా. అందరూకలిసి తనని ఎందు కిల్లా అవిధిపెడుతున్నారో ఆమెకు అర్థంకాలేదు. ఏం మించిపోయిందని రామలింగయ్యగారు అంత పొద్దున్నే బయటికి పోవాలి?— ఈ పెద్దమనిషిని తనమీదికి వదలిపెట్టి?

మిస్టర్ చింతా, కల్యాణివంక చూస్తూ కూచున్నాడు, చుట్టపొగద్వారా చూస్తున్నాడు. ఆస్థితిలో అతనిమెదడు ఒకతోవలో పని చేస్తుంటే, నోరు మరోతోవలో పోతుంటుంది. అంటే, అతనినో రేం మాట్లాడుతోందో చెవులేం వింటున్నాయో అతని మెదడుకి తెలియదు. మెదడులో ఏం జరుగుతోందో అది మాటలద్వారా వ్యక్తంకాదు.

"వెళ్ళారా? ఎక్కడికి?" అని అడిగాడు మిస్టర్ చింతా.

కల్యాణి నిత్తరపోయింది. ఈ ప్రశ్న దేనికి సంబంధించిందో ఆమెకు వెంటనే అర్థంకాలేదు. రామలింగయ్యగారు ఎక్కడికో వెళ్ళా రన్నసంగతి తను అతనితో చెప్పి కొన్ని యుగాలైంది. ఈ ప్రశ్న ఆ సహవాసానికి సంబంధించినదో కాదో తేల్చుకోడానికి:

"రామలింగయ్యగారేనా?" అంది కల్యాణి.

"రామలింగయ్యా? ఆయ నెవరు?" అని అడిగాడు మిస్టర్ చింతా.

"మా మావయ్య వరసని చెప్పానుగా," అంది కల్యాణి చిరాకుగా.

"మావయ్యా? మా వయ్యెవరు," అన్నాడు మిస్టర్ చింతా.

మిస్టర్ చింతా ఈ ధోరణిలో పడ్డాక, ప్రశ్న సమాధానపరంపర అనంతంగా సాగిపోతుందని, పాపం కల్యాణికి తెలియదు. ప్రతీ సమాధానంలోంచీ మరొక కొత్త ప్రశ్న పుట్టుకొస్తుంటే, తనని అవమానించడానికే ఈ పెద్దమనిషి పనిగట్టుకుని వచ్చాడనుకుంది కల్యాణి. ఆమె ముఖం ఎర్రబడింది. ముక్కుపుటాలు పెద్దవయ్యాయి. పెదవులు అణిచిపెట్టడానికి వీల్లేని కోపంతో అదిరాయి. చర్రుని ఆమె కుర్చీలోంచి లేచి నిలబడింది. అతన్ని నిలువునా భస్మం చెయ్యడానికి తగిన మాటలకోసం వెతుక్కుంటూ ఒకక్షణం ఆగింది. మిస్టర్ చింతాకి చుట్టపొగద్వారా చూడ్డంమూలాన ఆమె పరిస్థితి బోధపడలేదు; నిర్వికారమైన చిరునవ్వు పెదవులపై ఉంచి, తన ఆఖరి ప్రశ్నకు సమాధానంకోసం ఎదురు చూస్తున్నా డతను. తరవాత ప్రశ్నకూడా అప్పుడే అతని పెదవులమీద సిద్ధంగా ఉంది. ఈ అసందర్భ పరిస్థితి శ్రుతిమించి రాగాన్ని పడకండా, సమయానికొచ్చి రక్షించాడు రామలింగయ్య.

"ఆహాహా! 'వచ్చినాడవా, నా తండ్రీ'

అంటూ రాగవరసిని పాడి మిస్టర్ చింతాని కౌగిలించుకున్నంత పని చేశాడు రామలింగయ్య. మిస్టర్ చింతా చుట్టపొగలోకంలో నించి నేలమీదికి దిగాడు.

"గుడ్ మార్నింగ్. దయచేయండి. మార్నింగ్ వాక్ కి వెళ్ళారా?" అన్నాడు మిస్టర్ చింతా?

"అల్లాంటి మంచి అలవాట్లు మనకేం లేవురా అబ్బాయి", అన్నాడు రామలింగయ్య తనంతటివాణ్ణి "రా" అనగానే మిస్టర్ చింతా గతుక్కుమన్నాడు. ఆ తరవాత, అది ఆయన స్వభావమనీ, జవహర్‌లాల్ నెహ్రూ ఎదట పడ్డా, 'ఒరే' అనేస్తాడనీ గ్రహించాక, మిస్టర్ చింతా సమాధాన పడ్డాడు.

''వీరిని తెలుసా?" అంది కల్యాణి.

ఆ ప్రశ్న తనని అడిగిందేమో నని మిస్టర్ చింతా, "ఇంకానయం; పురాణ పురుషుల నందరినీ, నాటకరంగం మీదికి దింపిన నటసార్వభౌములు రామలింగయ్యగారి నెరగని అభాజను డుంటాడా, ఆంధ్రదేశంలో," అన్నాడు. కల్యాణి తన ప్రశ్న అతన్ని ఉద్దేశించి వెయ్యలేదని స్పష్టపడడానికి, చాకులాంటి గొంతుతో, "వీరెవరో" మీ కోసము వచ్చారు అని లోపలికి వెళ్ళిపోబోయింది.

"అమ్మాయి,'' అన్నాడు రామలింగయ్య. కల్యాణి ఆగింది.

' ఇత నెవరో తెలుసా? విన్న రాత్రి ప్రదర్శనం ఆలస్యమైంది ఇతనివల్లనే."

''ఓహో!'' అంది కల్యాణి. అటువంటి తప్పుడుపనికి అతనుతప్ప మరొకడు పూనుకోడని తనకు తెలుసు నన్నట్టు.

మోసయ్యగాణ్ణి భూశయనం చేశాడులే?" అంటూ విరగబడి నవ్వాడు రామలింగయ్య.

''ఈ ఊరంతా ఇలాంటి జులాయి మూకని తెలిస్తే, ఈ ప్రదర్శనానికి నేను చచ్చినా ఒప్పుకుని ఉండను,'' అంది కల్యాణి.

''అంతా ఆ మోసయ్యలాంటి వాళ్ళే ఉంటారా?'' అన్నాడు రామలింగయ్య.

అత నొక్కడేకాదు, ఇంకా ఉన్నారన్నట్టు మిస్టర్ చింతావేపు చూసింది కల్యాణి. కాని మిస్టర్ చింతా నిశ్చలంగా, అణకువగా చిరునవ్వు నవ్వుతూ నిలబడి ఉన్నాడు. రామలింగయ్య అన్నాడు.

"ఆ పీనుక్కు స్వస్తి చెప్పారటగా మీ సంఘంవాళ్ళు?''

"ఆ మీటింగునించే వొస్తున్నాను. విశ్వాస రాహిత్యతీర్మానం పెట్టి మిస్టర్ రోశయ్యని తొలిగించేశాం.''

"ఇప్పు డక్కణ్ణించే వొస్తున్నా; దొంగ వెధవ ఒక్కడే గోల. తనిచ్చిన వెయ్యినూటపదహార్లన్నా తిరిగి ఇచ్చెయ్యమంటాడు. నీ 'కిది జరగాల్సిన శాస్త్రేరా మానవాధమా!' అన్నా న్నేను. లేకపోతే, నా అంతటివాణ్ణి ఎదట పెట్టుకుని, అమ్మాయిల్ని అన్యాయం చేద్దామని చూస్తాడా?"

''క్షమించండి; వొచ్చినపని మరిచిపోయి ఏదేదో మాట్లాడుతున్నా నింతసేపూ. మిస్ వాణీ...'' అన్నాడు మిస్టర్ చింతా.

రోశయ్యని గురించిన చర్చ వింటున్న కల్యాణికి చటుకుని తనపేరు వాణి అని గుర్తు రాలేదు. ఆమె తెల్లబోవడం చూసి, మిస్టర్ చింతా బొమలు ముడివేసి ఆలోచించాడు.

''ఓహో! మీపేరు మిస్ కల్యాణి; మిస్ కల్యాణీ!... ప్రస్తుతం శ్రీ బాలాజీ ఫుట్‌బాల్ ప్రోత్సాహక సంఘకార్యదర్శి అయిన ఈ మిస్టర్ చింతా, మీ పారితోషికం రూ. 3000 ఈ చెక్కురూపంగా మీకు ప్రసాదించుకుంటున్నాడు. మీకు అకారణంగా మా మాజీకార్యదర్శి ద్వారా ఏర్పడ్డ ఇబ్బందికీ, మనస్తాపానికీ, ఈ సంఘం తరఫున క్షమాపణకూడా చెప్పుకుంటున్నాడు."

ముందుకి వంగి అతి అణకువగా అతడు సమర్పిస్తున్న చెక్కును కల్యాణీ అందుకోక తప్పిందికాదు. ఈ మనిషిదంతా నటనా? లేక అతని స్వభావమే అంతా? మాటలూ చేతలూ కొంత వింతగా కనిపించినా, మనిషి మంచివాడేమో నన్న అనుమానం కల్యాణికి కలక్కపోలేదు. అయినా ఇంతక్రితమే అతను ప్రదర్శించిన పొగరుబోతుతనం, మధ్య మధ్య నటిస్తున్న అతివినయం, ఇదంతా దూర్తలక్షణమే నని ఆమె గట్టినమ్మకం. అయినా ఇంకా రాదనుకున్న మూడువేలూ అతని ధర్మమా అని చేతులో పడింది అంచేత-

''థాంక్స్," అనిమాత్రం అంది కల్యాణి.

''రాధమ్మా," అని పిలిచాడు రామలింగయ్య.

ఈ సాకుకోసమే ఎదురు చూస్తోంది రాధ. అసలు రాధ విషాదంలో ఎక్కువసేపు కాలక్షేపం చెయ్యలేదు. ఆమెకు సరదా అంటే మహాసరదా. వింతలూ విశేషాలూ చూడ్డానికి ఆమె కెంతో కుతూహలం. ఆమె మనస్సు, పసి మనస్సు. తమని చూడ్డానికి వచ్చిన వింత జంతువుని—మిస్టర్ చింతా ఆమె కల్లా అనిపించాడు—ముఖా ముఖిని చూడాలని ఆమె మహా తహతహ పడుతోంది. రామలింగయ్య పిలవగానే నవ్వుతూ—హృదయకుసుమాల్లోని బరువు ఈసరదా అడుగున పడిపోయింది—ఇవతలికొచ్చింది. మిస్టర్ చింతాని చూసింది. తలుపుచాటునుంచీ చూసింది గాని, ఎదట నిలబడి చూడ్డం వేరు. మిస్టర్ చింతా, "నమస్కారం," అంటూ చేతులు జోడించబోయి, ఆరిపోయినచుట్ట వేళ్ళమధ్య ఉండడం గమనించి, "క్షమించండి,'' అని జాగ్రత్తగా దాన్ని, రెట్టతో సహా అవతల పారేసి తిరిగివచ్చి, ''గుడ్ మార్నింగ్," అన్నాడు. ఈ ప్రదర్శనం చూడ్డంతోటే ఎగిరి గంతేసి చప్పట్లు కొట్టాలన్న కోరిక బలవంతంగా ఆపుకుని, రాధ "నమస్కారం," అంది.

''మిస్ రాణి అనబడే మిస్ రాధా! కూచోండి. మిస్టర్ రామలింగయ్య బాబాయి! దయచెయ్యండి. మిస్ ...'' 'వాణి' అనబోయి మిస్టర్ చింతా ఆగాడు. కల్యాణి కామారుడుపేరు రుచించలేదనీ, అసలు

చిలిపితనం, నటన, ఆమె స్వభావానికి విరుద్ధమైనవనీ మిస్టర్ చింతా గ్రహించాడు. తనకి చేతనైనంత గంభీరంగా ముఖంపెట్టి, "కుమారి కల్యాణీ! కూచోం," అన్నాడు.

"ఏవిట్రా అబ్బాయి ఇది? వాళ్ళు నిన్ను మర్యాదచేయాలిగాని, ... " అన్నాడు రామలింగయ్య

"మగవారు మగువలను మర్యాద చెయ్యడం... మర్యాద," అన్నాడు మిస్టర్ చింతా.

"ఏమిట్రోయి నాటకంలో డైలాగా?" అన్నాడు రామలింగయ్య.

"ఒక నృత్యనాటకంలోది," అన్నాడు మిస్టర్ చింతా. ఈసారి రాధ నవ్వు ఆపుకోలేకపోయింది. కల్యాణి హెచ్చరిస్తూ ఆమె వంక చూసినా, రాధ లెక్కజెయ్యలేదు.

"ఏం నృత్యనాటకమండీ?" అని అడిగింది.

"హృదయ కుసుమాలు," అన్నాడు మిస్టర్ చింతా.

రాధ గుండె గొంతుకలో అడ్డుపడింది. పొంగివస్తున్న ఆవేశాన్ని బలవంతంగా దిగమింగి, "మీరు చదివారా?" అంది.

"చదవడమా? ఏది?" అన్నాడు మిస్టర్ చింతా.

"హృదయ కుసుమాలు."

"హృదయ కుసుమాలా! ఎవరివి?"

అనుకోకుండా సంభాషణ ఈగాడిలో పడేసరికి, మిస్టర్ చింతా తనంతట తను తప్పించలేడని మనం తెలుసుకున్నాం, ఈ సందర్భంలో రామలింగయ్య అడ్డుపడి.

"నువ్వేకదూ అసలు హృదయ కుసుమాల సంగతి ఎత్తింది. మళ్ళీ ఎవరివంటావేం?" అన్నాడు.

"ఓ — ఐమ్ సారీ, మిస్ రాధ అడిగింది మరొక హృదయ కుసుమాల సంగతై ఉండాలి."

"ప్రేమశ్రీ కొత్తనవల," అంది రాధ.

"రంగు రంగుల అట్ట వేసిన నవలా? ఇప్పుడు పట్టా అనబడే కుర్రాడి చేతిలో చూశాను."

రాధ గుటకవేసి ఔనన్నట్టు తల ఊపింది.

అసలు మిస్టర్ చింతాకి 'హృదయ కుసుమాలు' అన్నపేరు అది చూశాకే తోచింది. అయితే అది ఒప్పుకోదలుచుకోలేదతను.

"అటువంటి చవకబారు చచ్చురకం నవలలు చదవడం నా కలవాటులేదు," అన్నాడు మిస్టర్ చింతా నిరసనగా. పట్టా అంటే వాళ్ళకి అసహ్యం. అంచేత అతని చేతిలో నవలని కూడా నిరసనచేస్తే వాళ్ళకి తృప్తిగా ఉంటుందనుకున్నాడు. వెంటనే పెద్దతప్పు చేశారని గ్రహించాడు.

రాధ ముఖం ఎర్రపడింది. ముక్కుపుటాలు పెద్దవయ్యాయి. అసలే పెద్ద కళ్ళు మరింత పెద్దవై నిప్పులు కురుస్తున్నాయి.

"అది చదవకుండా, చచ్చురకం నవలని ఎల్లా కనుక్కున్నారు?" అంది రాధ.

నేనన్నది అపార్థం చేసుకున్నారు మిస్ రాధ. ఆ నవలలోని కథనిగురించి గాని, రచనాశిల్పాన్ని గురించిగాని నే ననడం లేదు. ఆ రెండూ అత్యద్భుతమైనవే కావచ్చు. నిజానికి 'హృదయ కుసుమాలు,' అన్న పేరుపెట్టిన రచయిత ఎంతో ప్రతిభావంతుడై ఉండాలని నే నంగీకరిస్తాను. నేనన్న చవకబారు చచ్చురకం పుస్తకం అచ్చులో, కాగితాల్లో- అన్నిటికన్నా అట్టమీది బొమ్మలో ఉంది. మనబోటి సంస్కారుల అభిరుచికి తగిన విధంగా పుస్తకం అచ్చువెయ్యాలి. చూస్తే వెగటుగొలిపే విధంగా పుస్తకం ఉంటే, దాన్ని నా చేత్తో తాకనేనేను," అని సద్దుకున్నాడు మిస్టర్ చింతా. ఈ వివరణ అక్కచెల్లెళ్ళ నిద్దరినీ తృప్తిపరిచింది. పుస్తకం ఆకారం విషయంలో కల్యాణి అభిప్రాయంకూడా అదే. రచయిత ప్రతిభావంతుడని ఒప్పుకున్న తరవాత రాధ కింక పేచీ లేదు.

"ఇంతకీ నీ 'హృదయ కుసుమాల' సంగతి చెప్పనే లేదు." అన్నాడు రామలింగయ్య.

"వొస్తున్నా." అన్నాడు మిస్టర్ చింతా. ఆ తరవాత తాపీగా జేబులోంచి కరోనా చుట్ట తీసి చిల్లుపొడిచాడు. అంటించి మెల్లగా పొగ వొదులుతూ, ఆ పొగద్వారా మరో లోకాన్ని దర్శిస్తూ, తన నృత్యనాటిక విషయం వివరించాడు.

"శ్రీరామచంద్రులవారు పుట్టకముందే వాల్మీకి మహర్షి రామాయణ మహాకావ్యాన్ని రచించాడని ప్రతీతి. నిన్న మొన్నటివరకూ నేనది కట్టుకథే అనుకున్నాను. కాని అది సంభవమని ఇప్పుడు గ్రహించాను."

మిస్టర్ చింతా ఒక క్షణం పొగ పీల్చి వదులుతూ ఆలోచించాడు.

"మిస్ కల్యాణీ! చిత్రం చూడండి. నిన్న రాత్రి మీ ప్రదర్శనం చూసేటంత వరకూ మీరొకరున్నారని నాకు తెలియదు గదా. ఆరునెల్ల క్రితం నే నొక నృత్యనాటిక రాశాను అది అక్షరాలా మీ కథ.

మిస్టర్ చింతా చుట్టపొగద్వారా కల్యాణి వంక చూస్తూ కొంచెంసేపు ఆగాడు. కల్యాణి తనలోకి తను ముడుచుకుపోతోందని గ్రహించాడు.

మీ అంతరంగిక విషయాన్ని గురించి ప్రస్తావించినందుకు మన్నించండి. నిన్న రాత్రి మీ ప్రదర్శనం చూశాక ఇవలికివచ్చి కార్లో కూచున్నాడు, ప్రదర్శనాన్ని గురించి తలంచుకుంటూ నాకు చుట్టఅంటించి, ఆపొగ చుస్తూ కూచుంటే ఇంక వొళ్ళు తెలియదు. అల్లా ఎంతసేపు కూచున్నానో. ఇంతలోకే ఒక కండలుదేరిన యువకుడు, చెదిరిన జుట్టుతో చిరిగిదుమ్మైన దుస్తులతో, తూలుతూ కారుమీద పడిపోయినంత పని చేశాడు. నే నతన్ని కార్లో ఎక్కించుకుని అతను చేరవలసినచోటికి చేర్చాను అయితే అతను అతిఉద్రేకంతో ఎవరినినో హత్య చేస్తానని పదేపదే అంటుంటే, మర్యాద కోసం ఎవర్నని అడిగాను.

(సశేషం)

# ఏరినముత్యాలు

**గురుబోధ :**

శ్లో॥ గురూపదేశః కిల కథ్యతే బుధైః అకర్ణశూలం కించన రత్నకుండలమ్।
అమేచకం నూతనమంజనం సతామ్ అజాతగాత్రక్షయమద్భుతం తపః॥

— *గంగాదేవి*

"గురువుల ఉపదేశము, సత్పురుషుల చెవులకు కర్ణశత్వములేని ఒక అపూర్వమైన రత్నకుండలము, కన్నులకు నలుపులేని ఒక నూతనమైన అంజనము, శరీరము కృశించని ఒకానొక అద్భుతమైన తపస్సు."

**చంద్రోదయము :**

శ్లో॥ ఉపోఢరాగేణ విలోలతారకం తథా గృహీతం శశినా నిశాముఖమ్।
యథా సమస్తం తిమిరాంశుకం తయా పురోఽపి మోహాద్గళితం న లక్షితమ్॥

— *పాణిని*

"చంద్రుడు (విటుడు), చంచలములైన నక్షత్రములు (కనుగ్రుడ్లు) గల సాయంకాలము (నిశాకాంత ముఖము)ను, అతిశయరక్తిమ (అనురాగ) బంధముచేత గ్రహించినవిధము ఎట్లున్నదనగా, ఆమె మోహమువలన, అంధకారమనెడు వస్త్రము పూర్తిగా తనయెదుట ఊడిపడినప్పటికిని, ఆతని అవస్థను కనుగొనలేకపోయెను.

**వసంతము :**

చ॥ పొలుపుగ నేచి, చెల్వడరఁ బూచి, బెడంగుగఁ గాచి పండ్రుమా
కులు; మరుఁ డేయఁ, గోయిలలు గూయ, మదాళులు మ్రోయ, రాగులున్
వలరస మందఁ, బ్రోషితులు వంద, వగల్ మొద మంద వచ్చె న
త్యలఘువసంత మూర్విఁ గనసంతవిభూతి నిరంతరంబుగాన్.

— *నన్నెచోడుఁడు*

— అందముపెరిగి, దట్టముగా పుష్పించి, ఫలించిన వృక్షములు కలిగి, మన్మథుడు విరహిజనములను వేధించుచుండగా, కోకిలలు కూయుచుండగా, గండుతుమ్మెదలు ఝంకారములు సేయుచుండగా, ప్రేమికులు వలపు రుచిని అనుభవించుచుండగా, ప్రవాసమునకు పోయిన ప్రేమికులు గల స్త్రీ పురుషులు బాధపడుచుండగా, విలాసములు ఆనందమును కలిగించుచుండగా, అనర్ఘమైన వసంతఋతువు అనంతమైన ఐశ్వర్యముతో భూమి యందంతటను అలముకొని నిండెను.

**జలక్రీడ :**

చ॥ వెలఁదికి మోవికెంపు, నెఱివేనలికప్పును, దంతపంక్తినం
దెలుపును బెట్టి యొప్పెసఁగె నీటులపొందున; నట్ల, యెవ్వరిన్
గలిసిన వారివారిదెసఁ గల్గుగుణం బనుకూలవృత్తి; ని
ర్మలమధురస్వభావులు సమగ్రవిలాసము వొందఁ జేయరే?"

— *తిక్కనసోమయాజి*

"జలక్రీడ చేసిన తరువాత పార్వతీదేవియొక్క పెదవుల యెఱుపు, సొగసైన వెంట్రుకలనలుపు, పలువరస తెలుపున్ను అతిశయించి నీళ్ళసంబంధముచే మిక్కిలి అందమయ్యెను. అది అట్లేకదా! ఎవ్వరితో సంబంధము కలిగినను వారివారి గుణములు అనుకూలముగా ఆ సంబంధము చేసినవారికి స్వాభావికముగా కలుగును. అట్లుండగా, నిర్మలము, మధురము నైన స్వభావముగల వారు (నీరు). తమచెలిమిని చేసినవారికి తమ గుణములను పొందజేయ కుందురా?"

చ॥ అదరని తేరు; తేరుకును నాదరు వై తగువిల్లు; వింటికిన్
గుదురగు నారి; నారిపయిఁ గూర్కు శరంబు; శరంబుబొడ్డునన్
బొదలినయంత; యంతముఖముల్ నిజవాసము లై నగ ట్టియుల్
చెదరక నీకు నెట్టిపని సేయునయా! గిరిజాధినాయకా?

— చక్రపాణి రంగనాథకవి

—త్రిపుర విజయమునందు శివునకు తేరు భూమి అది యెప్పుడునుచలింపదు; ఆ భూమినిధరించు భూధరము విల్లు; ఆ ధనస్సుకు కుదురైన అల్లెత్రాడు (ఆదిశేషుడు). దీనిపైన శయనించునది (విష్ణువు) బాణము. దాని నాభినుండి పుట్టినవాడు (బ్రహ్మ) సారథి; అతని నాల్గుముఖములందు నివసించునవి (వేదములు) గుఱ్ఱములు (ఇట్టి స్వశక్తిశూన్యములైన సాధనములు) నీకు త్రిపురవిజయమునందు ఎట్టి సహాయము చేయగలవయా! ఓ శంకరా!"

గీ॥ దక్షిణగంగ నాఁ దద్దయు నొప్పినగోదావరియు, జగదాది యైన
భీమేశ్వరంబును, బెశ గగుచున్న శ్రీపర్వతంబును, జూచి యుర్విలోన
ననఘ మై, శిష్టాగ్రహారభూయిష్ఠ మై, ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధ మై పొలుచు 'వేంగి' దేశవిభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి

గీ॥ ణాంబురాశితీర్థంబున కరిగి దురితహారి యైనకావేరీమహాసముద్ర
సంగమంబు భూసురేశ్వరుల కభిమతార్థదానంబు సేసి కృతార్థుఁ డగుచు.

— నన్నయభట్టారకుఁడు

'అర్జునుడు తీర్థయాత్ర చేయుచు, సుసమృద్ధము, పవిత్రము నైన వేంగిదేశమునందలి పుణ్యక్షేత్రములను దర్శించి దక్షిణసముద్రతీరమందలి భూసురులను సన్మానించెను."

వసంతము :

కం॥ క్రమముగ వర్ణజ్ఞానోద్యమనియముఁడు మధుఁడు వ్రాయునక్షరమాలా
క్రమ మన మహీఫలకంబున భ్రమరీపదచిహ్నసుమపరాగం బడరెన్.

— ఆంధ్ర విష్ణు

— క్రమముగా "ఓ నా మా"లు నేర్చుకొనుటకు ఉద్యమించుచున్న వసంతుడు భూమిపైన (ఇసుకలో) అక్షరములను వ్రాయుచున్నాడా అనునట్లు పుప్పొళ్ళపైన ఏర్పడిన తుమ్మెదల అడుగుగుర్తులు (ఉపవనమునందు) ఒప్పెను.

# అడవి మల్లె

## 13

### జరిగినకథ

చిన్ననాడే తలిదండ్రులను కోల్పోయిన చంద్రం, వదినెవల్ల దొంగగా నిర్ణయింపబడి, తీవ్రంగా శిక్షింపబడి, అమాయకపు గౌరీ సహాయంతో బయటపడతాడు. ఆత్మహత్యకు పాల్పడిన ప్రకాశాన్ని రక్షించి అతనితండ్రి ఆదరణతో చాల ఉన్నతస్థితిలో కొస్తాడు. తనఊరిలో గౌరిని నాగేంద్రం బలాత్కరించగా రక్షించి అనాథశరణాలయంలో చేరుస్తాడు. అన్న అభివృద్ధి చేసిన సంస్థను చూచి చాల సంతోషిస్తాడు. రజనీ, హేమలను కలుసుకుంటాడు. గౌరి అనాథశరణాలయం నుంచి చంద్రాన్ని చూచేందుకురాగా ఆమెను తీసుకొని చంద్రం ప్రకాశంఇంటికి వెళతాడు. గౌరి అమాయకత్వం చంద్రాన్ని కదిలించివేస్తుంది.

తలుపుమీద ఎవరో దబదబా బాదుతున్నారు మంచి నిద్రలో ఉన్న చంద్రం ఉలిక్కిపడి లేచాడు. కిటికీనుంచి లోపల పడుతున్న సూర్యకిరణాలు చంద్రం ముఖంమీద చురుగ్గా పడ్డాయి దిగ్గన లేచి కూర్చున్నాడు. తలుపు ఎవరోకాని చాలా గట్టిగానే కొడుతున్నారు. ఎవరైతే మాత్రం అంత గట్టిగా ఊపిరి తీసుకోనివ్వకుండా కొట్టాలా ఏం! విసుగ్గా వెళ్ళి విసురుగా తలుపు తెరిచాడు చంద్రం.

అంత పొట్టీ పొడుగూకాని ఓ యువకుడు ఎదురుగా కనిపించాడు. ఆ యువకుడు లావు కాకపోయినా చంద్రం అంతసన్నగా నాజూకుగా మాత్రం లేడు. ఆ వచ్చిన యువకుడు చంద్రం వైపు ఆశ్చర్యంగా చూశాడు.

''ఎవరు కావాలండీ? ప్రకాశం ఊళ్ళో లేడు;'' నిద్రమత్తు ఇంకా వదలని చంద్రం బలవంతంగా బరువుగా వున్న కనురెప్పల్ని పైకి ఎత్తటానికి ప్రయత్నిస్తూ అన్నాడు. ఆగంతకుణ్ణి సరిగా చూడకుండానే వెనక్కి తిరిగాడు.

'తమ రెవరండీ?" అంటూ ఆ ఆగంతకుడు లోపలకు వచ్చి, చేతిసంచిని టేబుల్ మీద వుంచి బెడ్డింగును ఒక కుర్చీమీద పెట్టాడు. అంత చనువుగా బెడ్డింగుతో సహా లోపలకు వచ్చిన వ్యక్తిని చూస్తున్న చంద్రానికి నిద్రమత్తు కాస్తా వదిలింది. ఆ వచ్చిన యువకుడు చంద్రం కళ్ళల్లోకి ఆశ్చర్యంగా చూస్తున్నాడు. కళ్ళు చిన్నవే అయినా చూపుమాత్రం చాలా చురుగ్గావుంది. దువ్వెన పళ్ళలా నిటారుగా వుండే జుట్టు చాలా దగ్గరగా కత్తిరించివుంది. ఆజుట్టూ! ఆ నల్లని చురుకైన కనుపాపలు!

ఆదే సమయంలో ఆగంతకుని దృష్టి నున్నగా, అందంగా వుండే చంద్రం మెడమీది పుట్టుమచ్చమీద పడింది. ఆ పుట్టుమచ్చ! తీర్చి దిద్దినట్లుండే ఆ కను ముక్కుతీరు!

'ప్రకాశ్!' చంద్రంనోటినుంచి పూర్తిగా వెలువడిందో లేదో, 'ఒరేయ్ చంద్రం!' అంటూ ప్రకాశం చంద్రాన్ని చుట్టేశాడు. ఆ క్షణంలో ఆ స్నేహితులిద్దరూ అనుభవించిన ఆ అపూర్వ అనుభూతి స్నేహమే సాక్షాత్తు సాకారరూపంలో వచ్చినా వ్యక్తం చెయ్యలేదేమో! అలా ఎంతసేపు వుండిపోయారో వారికే తెలియదు ప్రకాశం భుజంమీద పడిన కన్నీటిబొట్లు అతణ్ని ఈ లోకంలోకి తెచ్చాయి.

"అరే! చంద్రం! ఏమిటిది? మొత్తం మీద రచయిత వనిపించావోయ్!" అంటూ ప్రకాశం, చంద్రం రెండు భుజాలమీద చేతులు వేసి పక్కనే వున్న కుర్చీమీద కూర్చోపెట్టాడు.

చంద్రం కళ్ళు తుడుచుకుంటూ నిండుగా నవ్వాడు. ప్రకాశం తన చిన్నచిన్న చురుకైన కళ్ళను వీలయినంత పెద్దవి చేస్తూ చంద్రం ముఖంలోకి రెప్ప వాల్చకుండా తమాషాగా చూడసాగాడు.

'ఏమి టలా చూస్తున్నావ్?"

"రచయితవు కాబోలు చెప్పు చూద్దాం?"

"బాగుంది నా కేం తెలుసు? నువ్వే చెప్పు!"

''ఓస్ ఇంతేనా? నీ అందాన్ని చూస్తున్నాను. మగవాడికి ఇంత అందం పనికిరాదు. ఎందుకో తెలుసా? నేనే ఆడపిల్లనైతే ఎంత బాగుండేది అని అనుకుంటున్నాను అలాంటప్పుడు నిన్ను చూసిన ఆ ఆడపిల్లల గతేం కాను?"

"ఎంత మాట్లాడుతున్నావురా ప్రకాశం.

వాసిరెడ్డి సీతాదేవి

నీలో చాలా మార్పు వుంది. ఉండు ముఖం కడుక్కొస్తాను. తరవాత మాట్లాడుకుందాం,'' అంటూ లేచి చంద్రం దొడ్లోకి వెళ్ళిపోయాడు

ప్రకాశం ఉత్సాహంగా లేచి పక్కగదిలోకి వెళ్ళబోయి వాకిట్లోనే ఆగిపోయాడు. కింద జంపఖానామీద ఒత్తిగిలి పడుకొని వున్న గౌరిని చూసి గిర్రున వెనక్కు తిరిగాడు. అయితే చంద్రం భార్యనుకూడా వెంటబెట్టుకొని వచ్చాడన్నమాట! గట్టివాడే నవుకున్నాడు తనలో తానే ప్రకాశం.

పళ్లు తోముకుంటూ కూర్చున్న చంద్రానికి బుర్రలో చిన్నప్పటి స్మృతులు గిర్రున తిరగసాగాయి. శరీరంలోని ప్రతి జీవాణువూ కొత్త జీవం పోసుకున్నట్లనిపిస్తోంది. ఇద్దరి వ్యక్తుల మధ్య వుండే పవిత్రమైన స్నేహబంధాన్ని మించిన స్వార్థరహితమైనది మరో బంధం ప్రపంచంలో లేదేమో!

ఒకప్పుడు బక్కపలచగా, పీలగా, భయస్తుడిలా కనిపించే ప్రకాశమేనా ఈ ప్రకాశం? కత్తిలా దూసుకుపోయే స్వభావాన్ని ఎలా అలవరచుకున్నాడో!

''ఒరోయ్ చంద్రం! ఎంతసేపురా పళ్ళు తోముతావు?'' ప్రకాశం కేకతో ఆలోచనలనుంచి బయట పడ్డాడు చంద్రం. గబగబా ముఖం కడుక్కొని భుజముమీద వున్న తుండుతో ముఖం తుడుచుకుంటూ లోపలకు వస్తున్న చంద్రానికి ఎదురుగా చేతిలో కాఫీగ్లాసుతో, పెదవులమీద చిరునవ్వుతో ప్రత్యక్షం అయాడు ప్రకాశం.

"కాఫీ!" ఆశ్చర్యంగా ఏదో అడగబోతున్న చంద్రం మాటలకు మధ్యలోనే అడ్డువచ్చి "అవును! కాఫీ! నేనే చేశాను. తాగిచూడు మా మరదలు తయారుచేసిన కాఫీ అన్నాగూడా బాగుంటుందో లేదో!'' అంటూన్న ప్రకాశం చేతినుంచి చంద్రం కాఫీగ్లాసు అందుకున్నాడు.

"అవును కాని, మా మరదల్నికూడా వెంటబెట్టుకొచ్చినవాడివి మాటమాత్రం



అన్నావా? ఇందాక ఏమేమో వాగేశాను," అన్నాడు ప్రకాశం స్వరం తగ్గించి చంద్రాన్ని ఉడికించే ధోరణిలో.

అంతవరకూ ఆనందంగా ప్రకాశం మాటలను వింటూ కాఫీ తాగుతున్న చంద్రం చివరమాటలకు మిగిలివున్న కాఫీని ఒక్కసారి కషాయంలా మింగేశాడు.

"మా మరదల్నికూడా నిద్రలేపవోయ్! కాఫీ తాగుతుంది. ముఖ్యం, మా చంద్రం భార్య ఎంత అందమైనదో చూడాలని నా మనస్సులో తహతహ లాడుతూంది."

"ఊరుకోరా బాబూ! నీకు పుణ్యముంటుంది. ఆ అమ్మాయి వింటే ఏమయినా అనుకోగలదు.''

''అదేమిటి, అలా అంటున్నావు,' అయితే ఆవిడ..." ప్రకాశం కంఠంలో సందేహం, ముఖంలో ఆశ్చర్యం కనిపించాయి.

చంద్రం మనస్సు చివుక్కుమంది. అయితే ప్రకాశంకూడా తనను అనుమానిస్తున్నాడా? లేదు ప్రకాశం అనుమానించడు! అనుమానించకూడదు. ప్రపంచంలో ఏ సన్నిహితుడూ అర్థం చేసుకోలేని ఒక

హృదయపు లోతుల్ని ఒక్క స్నేహితుడు మాత్రమే అర్థం చేసుకోగలడు.

"ఏమిటోయ్! అంత ఆలోచన? ఏ చిక్కుల్లోనైనా చిక్కుకున్న అబలకు ఆశ్రయం ఇచ్చావా ఏమిటి?'' నవ్వుతూ ప్రశ్నించాడు ప్రకాశం.

కొంతవరకైనా ప్రకాశం తనను అర్థం చేసుకున్నాడు; అంతేచాలునని సంతోషించాడు చంద్రం

చంద్రం తను గుంటూరు స్టేషన్‌లో దిగినప్పటినుంచీ, ప్రకాశం వచ్చి తలుపు కొట్టినంతవరకూ జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.

"అవును. ఈ అనాథ శరణాలయాల్లో జరిగే దారుణాలను గురించి చాలా చాలా విన్నాను. కొందరికి ఇదొక జీవనోపాధిగా ఉపయోగపడుతోంది. కొందరికి కీర్తిని సంపాదించి పెడుతోంది. దాతలనుంచి సేకరించే దానంతోపాటు ప్రభుత్వగ్రాంటులు కూడా లభిస్తున్నాయి. ఇలాంటి శరణాలయాలకు. అందులో చాలాభాగం అధికారుల జేబుల్లోకే పోతోంది. పైగా కొందరు శరణాలయాధికారులు అందమైన ఆడపిల్లల ద్వారా పెద్దపెద్ద ఆఫీసర్లదగ్గరా, ధనవంతుల దగ్గిరా డబ్బూ, పరపతీ సంపాదిస్తున్నారట. మేము ఈ విషయాలను గురించి కూడా ఏం చెయ్యాలా అని ఆలోచిస్తున్నాము." అన్నాడు ప్రకాశం.

"ఇంత దారుణమా?" తెల్లబోయి ప్రశ్నించాడు చంద్రం.

''నేను ఏదో టూకీగా చెప్పాను. దగ్గరకు పోయి చూస్తే అసలు విషయం తెలుస్తుంది. మరి నువ్వు, ఆ అమ్మాయి ఎందుకు పారిపోయివచ్చిందో అడిగావా?"

"అడగలేదు." సిగ్గుపడుతూనే జవాబు ఇచ్చాడు చంద్రం.

''అడగలేదు. ఎందువల్ల? అలా అడిగితే ఆ అమ్మాయి బాధ్యత ఎక్కడ నీమీద పడుతుందోననే భయమే కదూ? చంద్రం! చదువూ, సంస్కారం కలిగి, రచయితగా సంఘంలో బాధ్యతగల వ్యక్తివి నీవే ఇలా ప్రవర్తిస్తే, ఇక మామూలువారి విషయం ఏం చెప్పాలి? ఇలాంటి అనాథలు బాగుపడే రోజు ఏనాడైనా వస్తుందంటావా ?"

''నన్నేం చేయమంటావు ప్రకాశం! ఈ అమ్మాయివల్ల అన్నయ్య ఇంట్లో నాకు జరిగిన పరాభవం విన్నావుగా?"

''అందుకని నీ బాధ్యతను నీవు విస్మరిస్తావా? వారి సంకుచితభావాలకు ఒకనాడు వాళ్ళే సిగ్గుపడతారు.''

"అదెలా సాధ్యం. ఇప్పుడు నే నేం చెప్పినా వాళ్ళు నమ్మరు,'' అన్నాడు చంద్రం.

"అసలు చెప్పుకోవాల్సిన అవసరం ఏముంది! నిజం నిలకడమీద తెలుస్తుంది. తప్పు చెయ్యని నీవు బాధ పడటం, సిగ్గుపడటం అనవసరం;'' ఆవేశంగా అన్నాడు ప్రకాశం.

"నా బాధంతా హేమ కూడా...''

"ఆమెమాత్రం అంతకంటే ఎక్కువ ఏం ఆలోచిస్తుం దంటావు? ఆ సభ్యతా, సంఘంలోఅంతస్థూ, నాగరికతా, సంస్కృతీ ముసుగుల్లోనుంచి చూసేవారి చూపుకు వారు ఆశించినదానికీ, అభిరుచికీ భిన్నంగా వున్నదంతా హేయమయినదే."

హేమను విమర్శించటం చంద్రం సహించలేక పోయాడు. ''పోనీయ్, ప్రకాశం! అంతా నా దురదృష్టమే మానవుడు విధి చేతిలో కీలుబొమ్మ ఏమో? లేకపోతే చెయ్యని దొంగతనం నా మీద ఎందుకు పడాలి? ఇంతకాలానికి తిరిగివచ్చి మళ్ళీ అందరూ నన్ను ఆప్యాయంగా స్వీకరిస్తారనీ నాఅంత అదృష్టవంతుడు లేడనీ అనుకున్న మరుక్షణంలోనే నేను మళ్ళీ అందరికీ దూరం కావాల్సిరావటం ఏమిటి? అందుకు నేను పెద్దగా విచారించటంలేదు. అసలు నేను ఈవూరు వచ్చింది నిన్నూ, నాన్ననూ చూసి నా కృతజ్ఞతలు చెప్పుకోవాలనే. నా దురదృష్టంకొద్దీ నాన్నను చూసేయోగం లేకపోయింది. నిన్ను చూశాను. నేను వచ్చినపని అయిపోయింది. రేపో మాపో నీ అనుమతి తీసుకొని వెళ్ళిపోతాను." చంద్రం ఉద్రేకంగా చెప్పుకుపోతున్నాడు.

"ఓరేయ్! సెంటిమెంటల్ ఫూల్! ఇక ఆపు నీ మెట్టవేదాంతం. కర్మ, విధి, అదృష్టం, దురదృష్టం అనే పదాలజాడ్యం నీకూ పట్టుకుందీ? ఈ జాడ్యం మానవ ప్రయాత్నానికే గొడ్డలిపెట్టు. ఈ జబ్బువల్ల నిలబడి స్థయిర్యంతో సాధించవలసిన కార్యాలను చూసి మానవుడు పలాయనం చిత్తగిస్తాడు. నువ్వూ అలాగే అందరినుంచీ దూరంగా పారిపోవటానికి మళ్ళీ ప్రయత్నిస్తున్నావు."

''అదృష్టం దురదృష్టం కాకపోతే నా జీవితంలో జరుగుతున్న సంఘటనలను ఏమంటావు ?"

"నేను దీన్నే జీవితం అంటాను. సంఘర్షణే జీవితం. జీవితంలో ఎన్నో సంఘటనలు తటస్థపడుతుంటాయి. అవి మనకు అనుకూలం అయినవిగా వుంటే అంతా మన ప్రయోజకత్వమే అనుకుంటాము. మనకూ మన సౌఖ్యానికీ అడ్డుతగిలే సంఘటనలయితే కర్మ, విధి అంటూ వాటినుంచి పారిపోవటానికి ప్రయత్నిస్తాము. కాని ఎదుర్కొని పరిష్కరించటానికి ప్రయత్నించము. జీవితసమస్యల్ని ఎదుర్కోవటానికి సాహసం, ఆత్మబలం, బుద్ధిబలంకూడా కావాలి, కేవలం కల్పనాశక్తిమాత్రం కలిగి అందమైన కలల్లో ఊహల్లా విహరించే నీలాటివాళ్ళు బాహ్య సంఘర్షణనుంచి పారిపోయి అంతః సంఘర్షణ పడతారు. తమతో తామే పోరాడుతూ, తాము నిలబడ్డ భూమిని మర్చిపోయి ఆకాశంలో విహరిస్తున్నామనుకుంటారు. తనచుట్టూవున్న మానవులు తను కల్పనాలోకంలో చిత్రించుకున్నవారికి భిన్నంగా కనిపించినప్పుడు ప్రపంచంనుంచి పలాయనమంత్రం పఠించటానికి ప్రయత్నిస్తారు."

"విధి, కర్మ, అనేవి లేకపోతే ఆ పదాలు ఇంతకాలంగా మానవ హృదయాలను ఎలా శాసించగలుగుతున్నాయంటావు ?"

"దానికి కారణం కొందరు స్వార్థపరులు. ఆపదాలను జాగ్రత్తగా ఒక తరం నుంచి మరో తరం వారికి అందిస్తూ వస్తున్నారు. సంఘంలో తమ ఔన్నత్యాన్నీ, అధికారాన్నీ, అంతస్థునూ నిలబెట్టుకోవటానికి కొన్ని వర్గాలు ఈ పదాలను ఆయుధాలుగా ఉపయోగించుకుంటూ వస్తున్నారు. పూర్వకాలంలో మత ప్రచారకులుగా, ఉన్నత వర్గంగా చలామణిలో వున్న బ్రాహ్మణ వర్గం ఈ పదాలను ఉపయోగించి అధిక సంఖ్యలను అజ్ఞానులుగా చేసి తమ ఆధిక్యాన్ని నిలుపుకుంటూ వచ్చారు. ఆ తరవాత రాజులూ, మహారాజులూ, జమీందారులూ, తమ అధికారాన్ని సుస్థిరం చేసుకున్నారు. ఈ పదాల ద్వారా, ఈనాడు కష్టజీవుల కళ్లు తెరవకుండా వుంచటానికి ఈ పదాలను సంఘంలో అంతస్థులు వున్న వారంతా వుపయోగిస్తున్నారు. పొద్దస్తమానం ఎముకలు పిండి చేసుకున్నా, తన అర్ధ ఆకలికి కారణం తెలుసుకోవటానికి మానవుణ్ణి ప్రయత్నించనివ్వకుండా చేస్తున్నాయి ఈ పదాలు.''

"ఏమిటి! కమ్యూనిష్టులా మాట్లాడుతున్నావు!" నవ్వుతూ అన్నాడు చంద్రం ప్రకాశం ధోరణిని మార్చాలనే ఉద్దేశంతో.

''కమ్యూనిజమా ? కమ్యూనిజం నా దృష్టిలో ఓ అందమైన ఆదర్శాలు కనే స్వప్నం మాత్రమే. అది సాధ్యపడేది కాదు. కాకపోతే ఈ పేరుతో అధికారవర్గం మారుతుంది అంతే! రష్యాలో ఇంత వరకూ కమ్యూనిజం స్థాపన జరగకపోవటానికి కారణం ఏమిటి? కమ్యూనిజమనేది ప్రకృతి నైజానికే విరుద్ధం. కాకపోతే కమ్యూనిస్టులు వుపయోగించే 'స్వాతంత్ర్యం, సమానత్వం' అనే నినాదాలు తమ హీన స్థితికి కారణాలు. 'విధి, కర్మ' అనుకుంటూ అజ్ఞాన నిద్రలో వున్న కష్టజీవులకు మేలుకొలుపులా పని చేస్తున్నాయి.''

"కమ్యూనిజం ప్రకృతినైజానికి విరుద్ధమని నేను అనుకోను."

"స్వాతంత్ర్యం అంటే ఏమిటి? మానవుడు ఏనాడు సంఘజీవిగా మారాడో ఆనాడే కొంత స్వాతంత్ర్యాన్ని అరికట్టుకున్నాడన్నమాట. కొందరికి అసలు స్వతంత్రతే అక్కరలేదు. అది ఇచ్చినా దాంతో ఏం చెయ్యాలో వారికి తెలియదు. ఒకరి ద్వారా శాసించబడటంలోనే వారికి ఆనందం లభిస్తుంది. ప్రేమపూర్వకమైన శాసనానికి మానవ హృదయం ఎప్పుడూ లొంగుతూనే వుంది. ఉదాహరణకు వాక్ స్వాతంత్ర్యాన్ని తీసుకుందాం. మనం అనుకున్నదంతా మాట్లాడగలుగుతున్నామా! ఒక వ్యక్తి తమాషా ముఖాకృతిని చూసి "నీ ముఖం బావురు కప్పలా వుంది,'' అని చెప్పాలనిపిస్తుంది. కాని చెప్పగలమా? స్వాతంత్ర్యం వుంది కదా అని రోడ్డు మీద ఇష్టం వచ్చినట్లు తిరగ్గలమా? ఇక సమానత్వం అంటావా — ప్రకృతిలో ఏ రెండు ఆకులూ, ఏ రెండు పువ్వులూ, ఏ ఇద్దరు వ్యక్తులూ సమానంగా వుండరు. అందరి వ్యక్తుల్నీ, మానసికంగా శారీరకంగా సమానంగా పుట్టించగలిగిన యంత్రాన్ని దేన్నయినా కనిపెట్టిన నాడు కమ్యూనిజం సంభవమేమో కాని అంత వరకూ అది కేవలం కొందరి ఆదర్శాల స్వప్నం మాత్రమే.''

"అందరి మానవులకూ సమానమైన అవకాశాలను కల్పించాలనేదికూడా నీ దృష్టిలో అసంభవమేనా?" చంద్రం ప్రశ్నించాడు.

''అవును; అదికూడా అసంభవమే. ఏ ఇద్దరు వ్యక్తులూ, మానసికంగా, శారీరకంగా ఒకటిగా లేనప్పుడు ఒకేలాటిఅవకాశాలను అందరికీ కల్పించటంలో అర్థంలేదు. కొందరు వ్యక్తుల బుర్రలు బొత్తిగా పని చెయ్యవు. అలాటివారు కాయకష్టానికే ఉపయోగపడతారు. ఒకమంచి ఇంజనీయరు కాగల తెలివితేటలు గలవానికీ, కేవలం కాయకష్టం మాత్రమే చెయ్యగలవానికీ ఒకే అవకాశం కల్పించారనుకో. అప్పుడు ఆ అవకాశాన్ని ఇద్దరూ సమానంగా వుపయోగించుకోగలరంటావా?"

"సమానావకాశాలంటే అది కాదని నా ఉద్దేశం. ప్రతిమనిషికీ తన అభిరుచికీ, బుద్ధికౌసల్యానికి అనుకూల మైన అవకాశం అందుబాటులో వుండేలా చెయ్యటమని."

"నేను చెబుతుందీ అదే. ప్రతిమనిషికీ జీవించటానికి కొన్నికనీస అవసరాలు వుంటాయి. అవికూడా అందుబాటులో లేక మానవుడు జంతువులా బ్రతకటం మానవ సంఘానికే సిగ్గుచేటు. ఆ తరవాత వారివారి మానసిక స్థాయికీ, అభిరుచికీ అనుకూలమైన చదువూ, దానికి తగ్గపనులూ కల్పించాలి. వారి వారి పనులను సృష్టిలో పెట్టుకుని వారి వారి అవసరాలను గుర్తించాలి. ఒక భవననిర్మాణం జరగాలంటే డిజైన్ వేసి, ప్లానుగీచి దాని నెలా నిర్మించాలో నిర్ణయించే ఇంజనీయరూ వుండాలి. రాళ్లు మోసేవాళ్ళూ వుండాలి. రాళ్ళు మోసే వారిచేత డిజైను, డిజైనువేసే వాడిచేత రాళ్ళూ మోయించలేంగా? ఇంజనీయరు ఒకేసారి దూరదూరములో వున్న కొన్ని భవనాల పర్యవేక్షణ చెయ్యగలడు. కాని రాళ్ళుమోసేవాడు ఒక సమయంలో ఒకే

చోట పనిచెయ్యగలడు. అందువల్ల ఇంజనీయరుకు కారు అవసరం. కాని రాళ్ళు మోసేవాడికి అక్కరలేదు అందుకే అందరికీ సమానావకాశాలు అనకుండా, అవసరమైన అవకాశాలు అంటే బాగుండేదేమో! దీనినే నువ్వు సోషలిజం అనులేక ఏ ఇజం అన్నా అను కాని కమ్యూనిజం మాత్రం కాలేదు."

"ఎంత సేపయింది బాబూ వచ్చి?" అంటూ ప్రవేశించింది రాజవ్వ. అంతలో ప్రకాశం వాక్ప్రవాహం ఆగిపోయింది.

'ఓ గంట అయింది. త్వరగా వంట చెయ్యి. ఇతను చంద్రం, నా చిన్న నాటి స్నేహితుడు. ఇతనుకూడా ఇక నుంచి ఇక్కడే వుంటాడు.'

"అలాగే బాబూ అంటూ రాజవ్వ లోపలకు వెళ్ళిపోయింది. ప్రకాశానికి గౌరి ఇంకా నిద్ర లేవలేదనే విషయం జ్ఞాపకమొచ్చింది.

"అరే మన మాటల్లో గౌరిని మర్చేపోయాం. చూడు రాజవ్వ! ఆ అమ్మాయిని నిద్రలేపు," అన్నాడు ప్రకాశం.

గౌరి పేరు ఎత్తగానే మళ్ళీ చంద్రం ముఖంలో మార్పు వచ్చింది. అది గమనించిన ప్రకాశం నవ్వుకున్నాడు.

"భయపడకు! ఇక ఆ అమ్మాయి బాధ్యత నీ కేమీ వుండదులే," అన్నాడు ప్రకాశం.

"బాబూ ఇలా రండి," పెద్ద కేక పెట్టింది రాజవ్వ. ఆ కేకకు ఇద్దరూ ఉలిక్కిపడి లేచి లోపలకు వెళ్ళారు ఆదుర్దాగా.

"వళ్ళు మంగలం లాగమాడిపోతోంది. పలకటం లేదు," అంది రాజవ్వ.

చంద్రం గబుక్కున వంగి గౌరి నొసటిమీద చెయ్యివేశాడు. వళ్లు కాలిపోతుంది. ఆమెను కుదుపుతూ "గౌరీ! గౌరీ!" అంటూ పిలిచాడు ఆదుర్దాగా.

గౌరి చిన్నగా కళ్ళు తెరిచింది. కానీ ఆ చూపులు ఎవర్నీ చూస్తున్నట్లు లేవు. వెర్రిగా ఎక్కడో దేన్నో చూస్తూంది. ఆ వెర్రిచూపుల వెనకనుండి ఏదో భయం తొంగిచూస్తోంది.

"నన్ను మళ్ళీ ఆ నరకంలోకి పంపించవద్దు. మా పెద్దమ్మ నన్ను చంపేస్తది," ఆగిఆగి అస్పష్టంగా అన్న గౌరి మాటలకు చంద్రం, ప్రకాశం ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు. అంతలోనే గౌరి కళ్ళు మూతలు పడ్డాయి ఈ సారి ఎంత పిలిచినా పలకలేదు.

"నేను వెళ్ళి డాక్టర్ను తీసుకొస్తాను." అంటూ ప్రకాశం తుండు భుజాన వేసుకొని గబగబా బయటకు వెళ్ళిపోయాడు.

చంద్రం ఏదోపెద్ద తప్పుచేసిన వాడిలా గౌరిపక్కనే కూర్చుని ఆలోచిస్తున్నాడు

రాత్రి తను చాలా నిర్దయగా ప్రవర్తించాడు. గౌరికి తనమూలంగానే ఇలా ముంచుకొచ్చింది. ప్రకాశం అయితే అలా ప్రవర్తించి వుండేవాడా? తను సంస్కృతి గురించి పుస్తకంకూడా రాసి బహుమతిని పొందాడు.

చంద్రం గౌరిముఖంలోకి చూశాడు ఆమె ఆ పెద్దపెద్ద కనురెప్పలు మూసుకొని అమాయకంగా నిద్రపోతున్నట్లుంది. ముంగురులు చెదరి ముఖంమీద చిందర వందరగా పడివున్నాయి.

చంద్రం యాంత్రికంగా ఆ ముంగురులను సరుతూ, గౌరి ముఖంలోకి జాలిగా చూస్తూ కూర్చున్నాడు. ప్రకాశం డాక్టరుతో ప్రవేశించాడు. ఇప్పుడే ఏ జర్వం అయిందీ చెప్పలేనన్నాడు డాక్టరు. ఇన్‌జెక్షన్ ఇచ్చి కొన్నిమందులు రాసి ఇచ్చి వెళ్ళిపోయాడు. డాక్టరు ఇచ్చిన చీటీని చేత్తో పట్టుకొని ఏదో ఆలోచిస్తున్న ప్రకాశాన్ని చూసి చంద్రం లేచాడు. పెట్టె తెరచి వెయ్యిరూపాయలు కాగితం కవరుతీసి అందించబోయాడు.

"ఏమిటి?"

"డబ్బు! నీ దగ్గిర వుంచి వాడు."

"ఎంతవుంది అందులో."

"వెయ్యిరూపాయలు."

"అంత డబ్బు నా కెందుకు. ఓ పది రూపాయలు ఇవ్వు ఇప్పుడు మందులకు సరిపోతుంది"

"నా దగ్గిర డబ్బు తీసుకోవటానికి సందేహిస్తున్నావా? ఈనాడు నేను ఇంత వాణ్ణి కావటానికీ, ఈ డబ్బు సంపాదించగలగటానికి కారకులు ఎవరు? నువ్వు! నీ ఋణం ఎంతడబ్బు ఇచ్చినా తీర్చుకోలేనిదని నాకు తెలుసు. కానీ..." చంద్రం గొంతు బొంగురుపోయింది.

'అదుగో మళ్ళీ మొదలుపెట్టావ్. మరో మారి కృతజ్ఞతా గితజ్ఞతా అను, చెబుతాను. నేను పరాయివాళ్ళ కెవరికి సహాయం చేశాను. నా ప్రాణ స్నేహితునికి సహాయం చేశాను. అందువల్ల నాకు సంతృప్తి లభించింది. అంటే అందులో నా స్వార్థం వుందన్నమాట."

"మరి అయితే నా దగ్గిర డబ్బు తీసుకోవటానికి సందేహిస్తా వెందుకు?" రెట్టించాడు చంద్రం ఉద్రేకంగా

"నీదగ్గర నాకు సందేహం ఏమిటోయ్. ఇప్పుడు అంత డబ్బు ఎందుకన్నాను, అంతే," అంటూ ప్రకాశం చంద్రంచేతిలో కవరు అందుకున్నాడు. చంద్రం ముఖం వికసించింది.

"ఇంత సున్నితమైన మనస్సు పెట్టుకుని ఎలా బతగ్గలవో చంద్రం!" అని ప్రకాశం మనసులోనే అనుకున్నాడు.

ప్రకాశం, చంద్రం, ఇద్దరూ కలిసి గౌరిని మంచంమీద పడుకోబెట్టారు,

(సశేషము)

# ఆంధ్రప్రదేశ్‌లో దర్శనీయ స్థలాలు: అదిలాబాదు జిల్లా



కుంతల జలపాతానికి వెళ్ళే త్రోవలో.



కుంతల వద్ద బంజారా స్త్రీలు.



110 అడుగుల ఎత్తునుండి దూకే కుంతల జలపాతం మనోహర దృశ్యం. అదిలాబాదు – నిర్మల్ రోడ్డున తూర్పున 7 మైళ్ళ దూరంలో యిది వుంది.



కుంతల జలపాతం మధ్యస్థంలో నంది.



పోచార జలపాతం దృశ్యం.



పోచంపాడు ఆనకట్ట నిర్మాణంలో కార్మికులు వహిస్తున్న పాత్ర



కడెం ఆనకట్ట విశ్రాంతి గృహం.



పోచంపాడు ఆనకట్ట విశ్రాంతి గృహం.



ఆదిలాబాదు జిల్లాలో గోదావరికి ఉపనది అయిన కడెంనదిపై ఒక ఆనకట్ట నిర్మింపబడుతున్నది. 65,000 ఎకరాలలో దాళ్వా పంటకు 20,000 ఎకరాలలో సాళ్వాపంటకు సాగునీటిని అందజేయటానికి పిలనా డిస్ట్రిబ్యూటరీ సిస్టం‌తో రిజర్వాయరుకు ఎడమ పార్శ్వంవైపు 48 మైళ్ళ కాలువ వస్తుంది. 1964–65 లోనూ, 1965–66 లోనూ ఉపయోగించిన ఆయకట్టు వరుసగా 16,000 ఎకరాలు. 14,000, ఎకరాలు వుంది. తృతీయప్రణాళికాంతానికి దీని క్రింద మొత్తం 40,000 ఎకరాల ఆయకట్టు వుంటుంది. ఈ ఆనకట్టకు ఖర్చు రూ. 601 లక్షలు అవుతుందని అంచనా.

భారత, రష్యాలమధ్య సాంస్కృతిక కార్యక్రమం మార్పిడిక్రింద కేంద్ర విద్యామంత్రిత్వశాఖ ఆహ్వానాన్ని పురస్కరించుకుని ఇటీవలే ప్రసిద్ధ బేలట్ నృత్యకళాకారుల బృందం ఒకటి రష్యానుంచి భారతదేశానికి విచ్చేసింది. రష్యాలో బేలట్ నృత్యంలోని వైవిధ్యమూ, ప్రాభవమూ, కళాకారుల పరిణత, కౌశలమూ ఈ బృందం వారి ప్రదర్శనల్లో ద్యోతకమవుతాయి. గతానికీ, వర్తమానానికీ, సాంప్రదాయానికీ, ఆధునికానికీ మధ్యకట్టిన వంతెనకు ఇవి తార్కాణాలా అనిపిస్తాయి.



నగరంలో ప్రదర్శనలను ఇచ్చేందుకు రష్యా బేలట్ నృత్యబృందం మార్చి 5 న బేగంపేట విమానాశ్రయం చేరుకున్నప్పటి చిత్రం.



రవీంద్రభారతిలో మార్చి 6న ముఖ్యమంత్రి, వారిసతీమణితో రష్యాబేలట్ నృత్యబృందం.



రాజభవన్‌లో గవర్నరుతో రష్యాబేలట్ నృత్యబృందం.



మార్చి 6 న రష్యాబేలట్ నృత్యకళాకారులకు స్వాగతం పలుకుతున్న ముఖ్యమంత్రి.



భరతనాట్యప్రదర్శన ఇచ్చిన సోవియట్ బేలట్‌నర్తకి వేరాబొచరోవా.





మంత్రముగ్ధులను గావించిన

## రష్యాబేలట్ నృత్యదృశ్యాలు

సుందరనర్తకుల మనోహరదృశ్యాలు







"ఆధ్యాత్మిక విలువలను ఆపాదిస్తూ పరిపూర్ణ కళాప్రాభవాన్ని ప్రదర్శించడం అచ్చమైన భారతీయ కళాకారుని ధ్యేయం. రష్యా బేలట్ నృత్యధోరణికూడా ఇదే. భారతదేశంలో రష్యాబేలట్ వ్యవస్థాపించిన ఈ జీవన స్పందనమే భారత, రష్యా ప్రజలను ఒక్కతాటిమీద నిలపగలదు."

— శ్రీమతి ఇందిరాగాంధీ











ప్రదర్శనను తిలకిస్తున్న ప్రేక్షకులు.



రవీంద్రభారతిలో మార్చి 6 న బాలేబృందముతో ముఖ్యమంత్రి.



శ్రీమతి రాఘవమ్మబ్రహ్మానందరెడ్డి, బృందం నాయకురాలికి పుష్పమాలను వేస్తున్న దృశ్యము.



శ్రీమతి రాఘవమ్మబ్రహ్మానందరెడ్డి యీ బృందంలోని ఇతర సభ్యురాండ్రకు పూలమాలలను వేస్తున్న దృశ్యం.



ముఖ్యమంత్రి, సోవియట్ బాలేబృందంలోని పురుషులకు నిర్మల్ చిత్రఫలకాలను అందజేస్తున్న దృశ్యం.



శ్రీ పి. వి. గురుమూర్తి, సోవియట్ బాలేబృందం నాయకురాలితో
కరచాలనం చేస్తున్న దృశ్యం.



సమాచారశాఖ మంత్రి శ్రీ పి. వి. గురుమూర్తి మార్పోగాను ఆంధ్ర
భారతిలో ప్రసంగించారు,



బృందం నాయకురాలు ప్రసంగిస్తున్న దృశ్యం.



బాలేబృందంతో శ్రీ పి. వి. గురుమూర్తి.



సమాచారశాఖ మంత్రి, సోవియట్ బాలేబృందం కళాకారులకు
శాలువలు బహూకరిస్తున్న దృశ్యం.





సమాచార పౌర సంబంధ శాఖ డైరెక్టరు మార్చి 9 న రవీంద్రభారతిలో సోవియట్ బాలేబృందానికి ఫోటో ఆల్బమ్ అందజేస్తున్న దృశ్యం.

---

## సోవియట్ చలనచిత్ర ఉత్సవం



ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు శ్రీ పట్టం థానుపిళ్ళై ఏప్రిల్ 1 న సోవియట్ చలనచిత్ర ఉత్సవానికి ప్రారంభోత్సవం చేశారు.



సమాచార పౌర సంబంధ శాఖ యీ ఉత్సవం నిర్వహించింది, సోవియట్ చలనచిత్ర ప్రతినిధివర్గం ఏప్రిల్ 4 న రాజభవన్‌లో గవర్నరును, సమాచారశాఖ మంత్రిని కలిశారు.

# భారతీయ కళ - మూల విలువలు

జయచామరాజ వడియార్

ఏ దేశంయొక్క గొప్పతనమైనా కేవలం ఆదేశం సాధించిన భౌతిక విజయాలను బట్టి నిర్ణయించడానికి వీలులేదు. ఆదేశంలో పరిఢవిల్లిన కళలు, సాహిత్యం, మతం, తాత్వికత — వీటినిబట్టే ఊహించవచ్చు. నైతికస్థాయి, ఆధ్యాత్మిక చింతన అప్పుడే అర్థమవుతాయి. ఆదేశంలో నెలకొన్న చైతన్యానికి, వెల్లివిరిసిన మానసిక వికాసానికి యివే సూచికలు. ఏ దేశంలోనైనా ప్రజల జీవితంలోంచే కళ ఉత్పన్నమౌతుంది. మొగ్గతొడిగి వికసిస్తుంది. వికసించి ఆ దేశ ప్రజల జీవితాలనే గుబాళింపజేస్తుంది. వారి జీవితాలను శోభాయమానం చేస్తుంది. భారతీయకళ అతి ప్రాచీనమైనది. క్రీస్తు పూర్వం మూడువేల సంవత్సరాలనాటిది. సువిశాలమైన భారత భూఖండాన్ని అంతటనూ ఆవర్తించి, ఎన్నోదేశాల క్రొత్త క్రొత్త భూముల్లో కాలూని పరివ్యాప్తమైంది. ఈ విస్తృత భారతావనిలో సంగీత, నాటక, సాహిత్య, చిత్ర, శిల్పకళా రంగాల్లో బహుధా వైవిధ్యం ద్యోతకమౌతుంది. అయితే అతిసునిశితంగానూ, స్థూలంగానూ; మేత్యూ ఆర్నాల్డ్ జీవితాన్ని దర్శించమన్న దృష్టితో నిశితంగా పరిశీలించి చూస్తే, యింత వైవిధ్యంలోనూ అంతర్లీనంగా దండలో దారంలా అముక్తచ్ఛేదమూ అనుస్యూతమూ, అర్థవంతమూ అయిన అవినాభావ సంబంధమేకాక భిన్నత్వంలో ఏకత్వంకూడా దర్శనీయమౌతుంది.

ఏజాతిలోనైనా మౌలికమైన, ఒకానొక ప్రత్యేకమైన గుణం దాగివుంది. ఆగుణమే ఆజాతిప్రజల కళకు ఒక ఆకృతిని ఇస్తుంది. ఈజిప్షియన్లు వారు కట్టుకున్న పిరమిడ్లలో, స్ఫినెక్స్‌లలో తమదైన ఒక ప్రత్యేకతను, ఇతరులకు తెలియని ఒకానొక కొత్తదనాన్ని సాధించారు. పురాతన గ్రీకుప్రజలు జీవితంలోంచి ఉద్దీప్తమైన వాస్తవవాదాన్ని ప్రేమించారు. గ్రీకుదేవుళ్ళు, దేవతలు ఆదర్శవంతమైన మానవమాత్రులే. గ్రీకులు ఉద్దేశించిన పరిపూర్ణ మానవ వికాసానికీ, నిష్కల్మష హృదయానికీ రూపకల్పనే వారిదేవుళ్ళు, దేవతలూను. పునరుజ్జీవన కాలంనాటి కళకుమూలం మతం. దేవునివైపూ, పరలోక విషయాలవైపూ మానవుని మేధస్సును ఉద్దీపింపజేసేది నాటికళ. వీటన్నిటినీ పరిశీలించి చూసినప్పుడు ఒకవిషయం స్పష్టపడకమానదు. ఒకజాతి ఆలోచనలూ, అనుభావాలూ, అనుభూతులూ—అన్నీ వారి కళల్లో ప్రతిఫలిస్తుంటాయి. తననూ, తన చుట్టూవున్న ప్రజల్నీ కదిలించిన ఆదర్శాలకు కళాకారుడు ఒక ఆకృతిని యిస్తాడు.

అయితే భారతీయ కళ యొక్క లక్ష్యమేమిటి? ఒక వాక్యంలో చెప్పాలంటే భారతీయ కళ ఆదర్శవాదాన్ని ప్రబోధిస్తుంది. ప్రకృతి రహస్యాలపై వెలుగును కుమ్మరించి భాష్యం చెప్తుంది. స్థూల జగత్తును ప్రతిఫలింపజేయడంతోనే అది తృప్తిపడదు. సర్వోత్కృష్టమైన ఒకానొక విషయాన్ని తెలియజేయడానికి అసమానమైన వింతవింత స్వరూపాల్ని ధరించడానికికూడా అది వెనుదీయదు. ప్రకృతికి అందనంత దూరంగా కల్పనలోకి ప్రయాణిస్తుంది. పాశ్చాత్య కళలో మూల సూత్రానికీ, భారతీయ కళలో మూలసూత్రానికీ చాలా వ్యత్యాసం వుంది. అలగ్జాండర్ పోప్‌మాటల్లో చెప్పాలంటే "మనిషికి ఉపయుక్తమైన స్వరూపంలో మలచబడిన ప్రకృతే కళ.'' ప్రకృతికి సాధ్యమైనంత సన్నిహితంగా ప్రతిబింబంగా ఉండడానికి ప్రయత్నిస్తుందిది. కాని భారతీయ కళాధోరణి వేరు. కంటికి కనిపించేదంతా సత్యమనుకోనవసరం లేదని తెలుపుతూ, అంతర్‌దృష్టితో వస్తువుల అంతరాంతరాలను దర్శించమంటుంది.

ప్రకృతి అనంతతత్వాన్ని బోధించి, ఈ జగన్నాటకానికి మూలమైన సత్యాన్ని శోధింపజేయడం; అనిత్యమూ, అనంతమూ అన్నదానికి అర్థాన్ని వివరించడమూ—ఇవే శతాబ్దాల తరబడీ భారతీయ కళాకారుని లక్ష్యాలుగా వుంటూ వస్తున్నాయి. రాతిని చెక్కినా, రంగులు పులిమినా, గానం చేసినా, కవితల్లినా ఎప్పుడూ భారతీయ కళాకారుడు యీ మనుగడకు మూలకారణమైన సత్యాన్ని శోధించడానికే కృషిచేశాడు.

అతనికి యీ ప్రకృతి యావత్తూ కేవలం భగవంతుని లీలా విశేషం. సత్యం, ఐక్యం అనేవి భారతీయ కళలో నిబిడమైవున్న మూలబీజాలు. వీనిలోనుంచి ఆదర్శతత్వం, మార్మిక దృష్టి, సంజ్ఞావాదము, ఉత్కృష్ట వాదములు మొలకెలెత్తి శాఖలల్లుకుంటాయి. భారతీయ కళ సత్యశోధనకూ, పరమాత్మలో ఐక్యం కావడానికీ మార్గాల్ని వేస్తుంది. ఈ మూలబీజాలు జాతి జీవితంలో జీర్ణమై ఆ దేశపు శిల్ప, చిత్ర, సంగీత, నృత్య, కవిత్వాలలో ప్రతిఫలిస్తాయి. ఒక విధంగా చెప్పాలంటే కళ అనేది చరిత్ర పరిణామాలను వ్యక్తంచేసే ఒకానొక దర్పణం.

భారతీయ కళ మొలకెత్తినదీ, పెరిగి పెద్దదై విస్తరిల్లినదీ ప్రధానంగా మతంమీదనే. ఆత్మ సంస్కృతి, ఆత్మ వికాసాలను సిద్ధింపజేసుకుని తద్వారా భగవంతుని తెలిసికోవడానికి చేసే కృషే కళ. దుఃఖాన్ని జయించడం ఎట్లా? అన్న ప్రశ్నను బుద్ధుడు లేవనెత్తాడు. జీవితం అర్థరహితం. దుఃఖం అనివార్యం అయినప్పుడు మనం కర్మబంధాన్ని ఛేదించుకుని నిర్వాణ స్థితికి

రాగలగాలి. భూతదయ, దానధర్మాలు, ప్రాణికోటి సేవ, భగవత్ చింతన, సర్వ సంగ పరిత్యాగం – వీటిద్వారా యీ స్థితిని చేరుకోవచ్చు. బాధ, దుఃఖం ఎలా వుంటాయో తెలుసుకొనే నిమిత్తం తనంత తానుగా ఆ స్థితిని కల్పించుకుని అనుభవంలోకి తెచ్చుకుని ఆ స్థితిని అధిగమించడానికి మార్గాలను వెతికిన బుద్ధ భగవానుడు బౌద్ధ కళ ఆవిర్భావానికీ, మహోజ్జ్వలమైన దాని వికాసానికీ మూలహేతు వయ్యాడు. భారతీయ సంస్కృతికి బౌద్ధకళ చేసిన సేవ అపూర్వమైనది. అనంత స్వరూపుడైన భగవానుని తెలుసుకోవడానికై బోధివృక్షం క్రింద ధ్యానముద్రుడైన బుద్ధుడు భారతీయ చిత్ర శిల్ప కళల్లో వివిధ రూపాలలో ప్రకటింపబడుతూ వచ్చాడు. అతి ప్రశాంతంగా, శాంత స్వరూపంతో, అచంచలతతో, ప్రాపంచిక వ్యామోహాలను దూరంచేసుకున్న పరిత్యక్త ప్రశాంత మనస్సుతో, ఇహలోక దుఃఖాలకూ, బాధలకూ అతీతుడై, కించిత్ తెరిచిన చక్షులతో తనలోకి తనే చూసుకుంటున్న దృక్కులతో పూర్తిగా భగవానుని ఎడ మనస్సును లగ్నం చేసి బోధివృక్షం క్రింద కూర్చుని ఉన్న బుద్ధుడి రూపం తరచుగా బహు విధాలుగా మనకు భారతీయ చిత్ర శిల్పకళల్లో కనిపిస్తూ వుంటుంది. భారతీయ కళాకారులకు ఆసక్తికరమైన మరొక ఇతివృత్తం సృష్టి. నటరాజు నృత్యంద్వారా దీనిని అభివ్యక్తీకరిస్తుంటారు. నృత్యంచేస్తూ జడప్రకృతిలోనికి చైతన్యాన్ని, శబ్దాన్ని, జీవాన్ని అలలుగా పంపి జీవ సృష్టికి మూలకారణమైన నటరాజు నృత్యం భారతీయ కళల్లో బహు భంగుల వ్యక్తీకరించ బడివున్నది.

### సౌందర్యవాదం:-

భారతీయ సౌందర్యవాదానికీ, పాశ్చాత్యుల సౌందర్యవాదానికీ అపారమైన భేదం వుంది. భారతీయుల సౌందర్య స్వరూపం వేరు. అపొలో బల్వడీర్, వీనస్‌డిమెలో, శిల్పాలు; బొట్టిసెల్లీ, రాఫెల్ చిత్రకారులు చిత్రించిన మడోన్నాచిత్రాలు, మైఖిల్ ఏంజిలో అపూర్వ కళాఖండాలు సౌందర్య నిధులే. కాని ఆ సౌందర్యం వేరు. గీతల అనుమేళన, రంగుల సమ్మేళన, మూర్తి చిత్రణ, అవయవాలపొందిక, దృష్టిక్రమ పద్ధతి – యివన్నీ కన్నులకు విందుకూర్చి తమ అసాధారణ సౌందర్యాన్ని వ్యక్తం చెయ్యగలవు. అయితే యీ సౌందర్యం కేవలం భౌతికం. ఈ మూర్తజగత్తుకు సంబంధించిన అందం ఇది. మానసిక ఆనందాన్ని అందించగలదుగాని ఆధ్యాత్మిక అనుభవాన్ని కలిగించలేదు. ఇ. బి. హేవెల్ అన్నట్టు ఇవన్నీ సౌందర్యపుతునకలు. భారతీయ కళాఖండాల్లో సౌందర్యం అలాకాదు. రెక్కలువిప్పి, అలౌకిక ఆనందపు వీధులలోనికి తీసుకుపోయి, పారలౌకిక అనుభవాలతో మనసును నింపివేస్తుంది. హేవెల్ పలుకుల్లో చెప్పాలంటే – భారతీయకళ ఈ మూర్తజగత్తులోనికి అమూర్త సౌందర్యాన్ని తీసుకురావడానికి ప్రయత్నిస్తోంది.

కళలక్ష్యం రసోత్పత్తి. రసమయమూ, సౌందర్యశోభితమూ, ప్రఫుల్ల విలసితమూ అయినకళాఖండం, ఔన్నత్య భావ పరిమళ వికాసానితో, మార్మిక అనుభవానితో ఆధ్యాత్మిక తృప్తికీ ఆలంబనమౌతుంది. మతము, కళ అత్యంత సన్నిహితంగా పెనవేసుకుపోయాయి. ఈ రెండింటివల్లా వచ్చే అనుభవం ఒక్కటే. అవి సత్యాన్ని తెలియజేయడం, విశ్వంతో తాదాత్మ్యం చెందడం అనేవి మనిషిలోని జీవాత్మ అతని చుట్టువున్న లౌకిక విషయాలనూ, మూర్తజగత్తుకు సంబంధించిన జీవికనూ ఛేదించి మరీ బైటపడుతుంది. రసమంటేనే సత్యం. రసమంటేనే వాస్తవం.

సత్యమనేది కళాకారుని ఎదుటనే భగవంతునిలీలా విశేషంలో అంతర్వ్యాపకంగా, అతనికి తెలిసే పద్ధతిలో పూర్తిగా కనిపిస్తూ వుంటుందా అనేది ఒక ప్రశ్న. సత్యమనేది కళాకారుని కొక్కడికే సంబంధించినదికాదు. అతను ఓమారు అలా చూడగలడుమాత్రమే. అలాచూసిన దానిని తనకూ, యితరులకూ మానసిక వికాసం కలగటానికి వీలుగా స్థూలమైన ఒకానొక రూపాన్నియిస్తాడు మనకు దేవుణ్ణిగురించి ఎరుకచెప్పే అధికారం కళాకారుడికివుంది. జీవితంలో అంతర్వ్యాప్తంగా నిబిడమైవున్న మాధుర్యాన్నీ, దృగ్గోచరమైన దానిలో అగోచరమైన దానినీ, తాత్కాలికంగా యీ బొందిని ఆశ్రయించిన జీవుడినీ మనకు విశదపరుస్తాడు కళాకారుడు. కేవలం లౌకిక సౌందర్యం వెంటబడి భారతీయ కళాకారుడు పరుగులెత్తడు. తన లక్ష్యాలను అత్యున్నత పథంలో నిలుపుతాడు ఆధ్యాత్మిక అనుభవాలను వెతుక్కుంటూ పోతుంటాడు. తన హృదయాంతరాళంలో కదిలి కదలించిన అనుభవాలను తనకుతోచిన మార్గంలో ప్రకటించుకోడానికి ప్రయత్నిస్తుంటాడు. ఇందుకుగాను యోగస్థితికి— అంటే దానితో తాదాత్మ్యంచెందిన స్థితిలోనికి— వెళ్ళిపోతాడు. ఆ విధంగానే వాల్మీకి రామాయణాన్ని రచించాడు. తన అసాధారణ యోగదృష్టితో శ్రీరామచంద్రులవారి కథను మనోఫలకంమీద చిత్రించుకుని శాశ్వతయశో విరాజితమైవెలుగొందుశ్లోకాలలో రచించాడు.

కళాత్మకమైన సృష్టివల్ల రసం ఉత్పన్నమౌతుంది. ఈ రసానుభవం బహుభంగులుగా వుంటుంది. అంతేగాదు, ఆపారం కూడా. ఎంత ఎక్కువ అంటే మనిషిలోని జీవాత్మను సైతం శక్తివంతంచెయ్యగలదు రసం మనిషిలో ఆత్మవిశ్వాసాన్ని కల్పించగలదు. కళ లక్ష్యాలు చతుర్విధాలుగా కాళిదాసు వక్కాణించివున్నాడు (ఎ) కళభగవంతుని మనసును రంజింప జేస్తుంది. భగవంతునికి అర్పించేవాటిలో నాటకం చాలా ఆకర్షణీయమైన నైవేద్యంగా ఋషులు భావించేవారు.

(బి) కళ అనేది మనుషుల ప్రవర్తనతో సంబంధం కలిగివుండి జీవితంలోని సంతోషాలనూ, దుఃఖాలనూ— సత్వ, రజో, తమో గుణాలనే మూడు ముఖ్య గుణాలద్వారా ప్రకటింపబడుతుంది. ఈ

గుణాలను క్రియారూపంగా అభివ్యక్తీకరిస్తే ఒకగొప్ప నాటకాన్ని సృష్టించవచ్చు.

(సి) కళ బహువిధములైన రసాలను ఉత్పత్తి చేస్తుంది గనుక భక్తుడికి అనేక రకాల సర్వోత్కృష్టమైన ఆనందాలను అనుభవంలోకి తెస్తుంది.

(డి) కళ సర్వులకు ఆనందాన్ని ప్రసాదిస్తుంది. యువకులను, ముదుసలులను, సంతస మానసులను, సంతాప పరితప్త హృదయులను, రోగిష్టులను, విజితులను, జితులను, రాగులను, విరాగులను- సర్వ మానవులను రంజింపజేయ గలిగేది కళ తప్ప మరొకటి లేదు.

మనసును అత్యున్నత పథంలో నిలపడమే కళధ్యేయం. ఈస్థితి ఎంతకొద్ది సమయమైనా. ఎంత తాత్కాలికమైనదైనా మనలో కొద్దిక్షణాల ఆనందపు అమృత ఝరులను కురిపించి, ముందు ముందు వాస్తవమైన ఆనందాన్ని వెతకడానికి పూనుకునేటట్టు మనల్ని చైతన్యవంతుల్ని చేస్తుంది.

అన్నిస్థాయీ భావములలోనూ ప్రేమ అత్యున్నత స్థాయీ భావమని భారతీయులు భావిస్తారు. రసానుభవానికి యీస్థితి పరాకాష్ట. భాగవతం ద్రావిడ ప్రబంధంవంటి కావ్యాలలో నాయకీ, నాయికల సంబంధం ప్రేమ ప్రధానంగా వుంటుంది. భగవంతునికీ, భక్తునికీ మధ్య అన్వయించదగినంతగా యీ ప్రేమతత్వం విస్తరిల్లింది. చాలా రకాల మానసిక స్థితిగతులు స్త్రీభావ ప్రకటనాను గుణమైనవే.

భగవంతుని నాయకుడిగా భక్తుడు నాయికగా భావించి భగవానుని నిత్యజీవిత అనుభవంలోకి తీసుకొస్తారు: స్త్రీ పురుషుల మధ్య భార్యాభర్తలుగా వుండే సంబంధం— అర్పణ, ఆరాధన - యివే భగవంతుడు, భక్తుడిమధ్య అన్వయించబడుతుంది. భక్తి తన్మయస్థితి శృంగారస్థితికన్న గొప్పదని రూప గోస్వామి నిర్వచించారు. కృష్ణుని భక్తులు నీలమేఘశ్యాముడిగా పిలుస్తారు. ఆ నీలిమకాంతిదేహమే అతని ఎడ ప్రేమను సృష్టిస్తుంది. ఇక్కడ ఒకవిషయం మనము అర్థం చేసుకోవాలి. భగవంతుడికి సంబంధించిన ప్రతిదీ ప్రేరణమూలకమే. భక్తులు వాటిద్వారా ప్రేరేపితులై అలౌకిక స్థితిని అనుభవంలోకి తెచ్చుకుంటారు. ఫలితం ఆనందబాష్పాలు మిగులుతాయి భగవానుడు ఆలంబన భక్తులు ఉద్దీపాలు. అనుభూతి ఫలితం ఆనందబాష్పాలు.

## సాంప్రదాయక విలువలు:

భగవంతుని గూర్చి ప్రకటించినపుడే కళ చరితార్థక మౌతుందనేది మన పురాతన నమ్మకం. విక్రమోర్వశీయ లో కవితా లక్షణ్ని సహృదయులు గుర్తించాలి. ఈ నాటకాన్ని చదివినవారు కేవలం అందులోని కవితాశైలిని, యతి ప్రాస పుష్టినీకాదు పొగిడేది. ఆనాటకంలోవచ్చే ఉత్కృష్ట పాత్రల్నీ. ఉన్నతవిలువల్నీ పొగుడుతారు. నైతికస్థానిని పడద్రోసే కళాఖండాలు ఎందుకూ పనికిరావు

మరొకవిషయం. కళధ్వని ప్రధానంగా ఉండాలి. అంటే సూచనప్రాయంగా భగవంతునిగూర్చి తెలియజేసేదిగా వుండాలి. అనంతసౌందర్యస్వరూపుడైన భగవంతుడ్నీ అతని లీలలనూ పరోక్షంగా వ్యక్తం,చేసేదే నిజమైనకళ.

రఘువంశకావ్యాన్ని ప్రారంభిస్తూ కాళిదాసు మాటకు, శబ్దానికి మధ్యవుండవలసిన అవినాభావ సంబంధాన్ని గురించి చెప్పివున్నాడు. శబ్దానికి, అర్థానికి మధ్యవుండే సంబంధం అతిపవిత్రమైనదని పార్వతీ పరమేశ్వరులమధ్య వుండే సంబంధమంత పవిత్రమైనదని పేర్కొన్నాడు.

భారతీయ కళకు యావత్తూ భగవంతుడే ప్రధాన యితివృత్తం. శిల్పకళను పరిశీలించండి. భారతదేశంలోని దేవాలయ శిల్పాల్లో అధికభాగం భగవంతుని లీలా విశేషాలను వ్యక్తంచేసేవే అన్నవిషయం చిత్ర, శిల్పకళల్లో అభిరుచివున్న ప్రతివారికీతెలిసిన విషయమే. భారతీయ శిల్పకళ ప్రధానలక్ష్యం యిదే. చిత్రకళలలో కూడా యింతే. భగవంతునిలీలా విశేషాలను ప్రకటించినప్పుడే చిత్రకళ సఫలమౌతుందని ప్రఖ్యాత చిత్రకారుడైన రవివర్మ భావించాడు. సంగీతంలోనూ అంతే. త్యాగరాజు, దీక్షితార్, పురందరదాసు — వీరంతా భగవంతుని గూర్చి, అతని లీలలనుగూర్చి, పరాక్రమ ప్రాభవాలనుగూర్చి గానంచేశారు. దేవాలయాలు భగవానుని లీలావిశేషాలను ప్రకటిస్తాయి. నృత్యం, నాటకం భగవంతుని సంతుష్టి పరచడానికే. వేయేల మనపురాణాలు, కావ్యాలు, మన సాహిత్యం అంతా ధర్మప్రతిష్టాపనకే. అత్యుత్తమ నాటకంగా ప్రసిద్ధికెక్కిన ప్రబోధ చంద్రోదయంలో వేదాంతచర్చే ప్రధానంగావుంది.

భారతీయ రసదృష్టి మూలసూత్రం సౌందర్యారాధనతో ముడిపడివుంది. సౌందర్యానికి పరాకాష్ట భగవంతుడు గనుక భగవదారాధన ఎంత ప్రధానమైనదో సౌందర్యారాధనకూడా అంతే ప్రధానమైంది. భగవంతునికి ఆరోపించబడిన అనంతరమే లౌకికవస్తు సంచయానికి ఆరోపించబడుతుంది. గీతలో ''అనంతము, సద్గుణము, పవిత్రము, అజేయమూ అయినది ఏదో అది నాలోని అంశంగానే భావించుము,'' అన్నాడు శ్రీకృష్ణుడు.

కళ కళకోసమే, అన్న వాదాన్ని భారతీయులు అంగీకరించరు. కళ నైతిక పునరుద్ధరణ లక్ష్యాన్ని భారతీయులు నమ్ముతారు. కళ, నీతి అనేవి కలిసివుంటే పరస్పర ప్రయోజనాలకు దోహదకారులు అవుతాయి. కళను ఉన్నత పథంలోనిలిపి. ఆధ్యాత్మిక విలువలను ఆపాదించినపుడు నైతిక విలువలు మరింత బలంగానూ. సుందరంగానూ రూపొందుతాయి.

ఈనాటి అధిభౌతిక, యాంత్రిక వాతావరణంలో ఏ నాగరికత జీవనమార్గములోనైనా కళనైతిక విలువలసముచితస్థానాలను మర్చిపోయి మనందాటుకునిపోయేప్రమాదం వుంది. కనక మనం రసదృష్టినీ, నైతిక విలువనూ విస్మరించడానికి వీలు లేదు. భారతీయ మేధావులు యీ రెండింటికీ అత్యధిక 'ప్రాధాన్యతను యిచ్చివున్నారు. నైతిక విలువలతో ఉద్దీప్తమైన రసతత్వ చింతనతో జీవితాలను నింపుకుని శోభాయమానమూ. సౌందర్య విలసితమూ, సుసంపన్నమూ చేసుకోవడానికి కృషిచేద్దాం.

# భాగ్యచక్రం

ఆరెకపూడి కౌసల్యాదేవి

**జరిగినకథ**

వైద్యశాస్త్ర పట్టభద్రుడైన శ్రీనగేష్‌యొక్క సేవాతత్పరత మామయైన శ్రీపతికి నచ్చదు. సైన్యంలో వైద్యాధికారిగా చేసిన శ్రీనగేష్ ప్రవర్తన వీరికి హాస్యాస్పదంగా వుంటుంది. శ్రీపతి కుమారుడైన శ్రీహరికి వివాహం నిశ్చయంకాగా సమయానికి కట్నం అందని కారణంగా వివాదం జరుగుతుంది. పెళ్ళిపందిట్లో రసాభాస కాకుండా, శ్రీనగేష్ ప్రేమపూర్వక వచనాలతో అంతమవుతుంది. శ్రీనగేష్ తల్లి శ్రీదేవికి అనుకున్నపెళ్ళి జరగకపోవడం ఆశ్చర్యం కల్గిస్తుంది. శ్రీనగేష్ తన అధికారబాధ్యతలను సక్రమంగా నిర్వహించి తిరిగి తన వైద్యశాలకు వచ్చేస్తాడు. మామ శ్రీపతికో కారుప్రమాదంలో మతిస్థిమితం తప్పిపోతుంది. కూతురు జయశ్రీ తండ్రిని వెంటఁడుకుని శ్రీనగేష్ హాస్పటల్‌కు వస్తారు. శ్రీనగేష్ వివరాలనూ, పరిస్థితులను జయశ్రీద్వారా తెలుసుకుంటాడు.

శ్రీనగేష్ ముఖంలోకిచూస్తూ ప్రశ్నించింది జయశ్రీ; "నాన్న కేసు తీసుకుంటావా నువ్వు? ప్రశాంత పరిస్థితిలో వాతావరణంలో, తెలివైన మనస్తత్వ శాస్త్రజ్ఞుడైన వైద్యుడు బాగుజేయగల అవకాశం వున్నదనే నిర్ణయానికివచ్చారు, కడకు చాలమంది డాక్టర్లు. ఎవరిదగ్గఱకు వెళ్ళడమా అని మథనపడ్డాను. ఇప్పటికీ పడ్తున్నాను. సరే, నువ్వా మనస్తత్వం చదివినవాడవేకదా? మెంటల్ డిసీజెస్‌ను సైకలాజికల్‌గా ట్రీట్ చేసి క్యూర్ చేయడంలో ట్రైనింగ్ అయ్యావుకదా? అందుకే ఇక నీదగ్గఱకు తీసుకొచ్చాను."

"నీకున్న అభిమానానికి సంతోషమే కాని, ఏమో నావల్ల అయ్యేదోకాదో?– ముందు నేనాయనను చూడాలి."

"అయితే చూసేముందు, తప్పనిసరిగా కొన్ని విషయాలు వినాలినువ్వు."

"తప్పకుండా. అది చాలా అవసరం కూడ! నీకభ్యంతరము లేనంతవఱకూ– వీలైనంత వివరంగా చెప్పు!"

"ఆరోజున...... మేమందరం తిరిగి వచ్చేస్తున్నాం, అంటే చిన్నన్నయ్య పెళ్ళి చెడిపోయిన రోజున, నువ్వూ అక్కడే వున్నావుగా, అంతా చూచావు."

"ఊఁ."

"ఆపెళ్ళి జరిగినా బాగుండునేమో, ఈ యాక్సిడెంట్ జరగకపోను."

"అయితే. ఆపెళ్ళి చెడగొట్టుకు పోతూన్నప్పుడే యాక్సిడెంట్ జరిగిందా!"

"అవును. ఆపిశాచి లెక్కడ దాపురించారో మాప్రాణానికి! అసలు ఈపెళ్ళి ప్రస్తావన జరగకున్నా మా కుటుంబం ఎప్పటిలా సుఖంగావుండునేమో!"

శ్రీనగేష్ మాట్లాడలేదు, ఇంకా పైన ఆమెచెప్పే విషయాలకోసం ఎదురు చూస్తున్నాడు.

"నేనూ, అమ్మా, నాన్నగారూ ఒక కారులో, అన్నయ్యాలూ, వదినలూ ఒక కారులో వెళ్తున్నాం. ఇంకా ఎదరచుట్టాలూ స్నేహితులూ ఉన్న బస్సులూ, కార్లూ వెళ్తున్నాయి. వరుసగా సాగిపోతూన్న కారులలో, హఠాత్తుగా డ్రైవరుకు ఏం దుర్బుద్ధి పుట్టిందో, స్పీడుగా ఎదరవాటిని దాటిపోవాలన్న ప్రయత్నంలో వరుసలో నుంచి యివతలికి వచ్చి ఎదర వాటి నన్నిటినీ దాటుకు పోసాగాడు. వాడినిచూచి మా కారు నడుపుతూన్నవాడుకూడా కోతిలా వరుసనుంచి తప్పించేసి ఆ కారువెంట పడ్డాడు. ఈ పోటీ బాగా జరిగినంత సేపు చూపరులకు వినోదంగా బాగానేవుంది. కాని ఖర్మకాలిపోయింది. అంతలో, ఈ వేగంలో ఎదురుగా వస్తూన్నలారీని తప్పుకోలేక గుద్దేశింది ఎదరకారు. దానిని ఆ వెనుకనే పోతూన్న మాకారు ఢీకొట్టేసి గాలిలోఎగిరి తలక్రిందులైంది, ఒక్కసారి హాహాకారాలు. కీచు కీచుమని కారులు బస్సులూ అన్నీ సడన్ బ్రేక్‌లువేసిన చప్పుళ్ళు– అంతే, కళ్ళుచీకట్లు క్రమ్మాయి నాకు.'' గతదృశ్యాలు, సంఘటనలు కనులముందు

మెదలడంతో కంఠం గద్గదికమై, కనులలో నీరు తిరిగింది జయశ్రీకి.

వింటున్న శ్రీనగేష్ మనస్సు చెదిరిపోయింది, "ఎంతదారుణంగా జరిగింది!" అన్నాడు బాధగా.

తనను తాను సంబాళించుకుని తిరిగి చెప్ప నారంభించింది జయశ్రీ; "మర్నాడు సాయంత్రం హాస్పిటల్‌లో కళ్ళు తెరచేసరికి అతినీరసంగా, శరీరమంతా పట్లు తప్పిపోయి వున్నాను; మరోబెడ్‌మీద నాన్నగారు తలకు పెద్దకట్టుతో స్పృహ లేకుండా పడివున్నారు. అమ్మ, అన్నయ్యలు మరోగదిలో వున్నారని నర్సు చెప్పింది. భయంవల్ల కలిగిన 'షాక్' మినహా నాకేమీ శరీరంమీద పెద్దగా దెబ్బలు తగల్లేదు. చాలా నీరసంగామాత్రం వున్నాను. మెల్లగా పాలూ, రొట్టె తీసుకున్నతర్వాత ఓపిక వచ్చింది. కాని డాక్టరు చెప్తేకాని ప్రక్కమీదనుండి కదలవద్దని శాసించింది నర్సు. ఎప్పుడు డాక్టర్ వస్తారా—ఎప్పుడు అన్నయ్యలనూ అమ్మనూ చూస్తానా అని ఎదురుచూచిననాకు డాక్టరువచ్చి మెల్లగా సానునయంగా చెవినవేసి పోయారు—'అమ్మా, అన్నయ్యలూ మరో గదిలోకాదు—మరోలోకంలో వున్నా'రని!" చెప్తూనే బొటబొటా కన్నీరు కార్చింది జయశ్రీ.

శ్రీనగేష్ నేత్రాలలో సానుభూతి వర్షించింది, కాని మాటలుమాత్రం ఎంత ప్రయత్నించినా దొరకలేదు, నోరు చిత్రంగా మూగపోయింది. సిగరెట్ తీసి వెలిగించుకుంటూ అన్నాడు; "పోనీ! నీమనస్సు కుదుటపడ్డ తర్వాత మరోసారి చెప్దువుగానిలే జయా. ఇప్పుడిక నీవల్లకాదు."

"ఫర్వాలేదు కూర్చో." అంటూ కండ్లు తుడుచుకుంది జయశ్రీ. కొద్దిసేపటికి మామూలు స్థితికి రాగలిగింది. పది నిముషాలు బరువుగా దొర్లిపోయాక తిరిగి చెప్ప నారంభించింది:

"మా కారుకూ ఎదర లారీకి మధ్యపడిన అన్నయ్యల కారు రూపాన్నే



కోల్పోయి, తుక్కు తుక్కుగా నలిగిపోయింది. చెప్పడానికి నోరు రావడం లేదు ... కాని చెప్పక తప్పదు. ఇద్దరు వదినలూ, ముగ్గు రన్నయ్యలూ, డ్రైవరూ రూపాలే లేకుండా నలిగి నాశనమయ్యారు. మా కారులో ఎదర సీటులో కూర్చున నాన్నగారికి, డ్రైవరుకూ బలమైన గాయాలు తగిలాయి. వెనక సీటులో కూర్చున్న నేను బాగానే వున్నాను, ఎలా ఉన్నానో మరి! కాని నా ప్రక్కనే కూర్చున్న అమ్మ..." వాక్యం పూరించలేకపోయింది.

"కారు గాలిలో లేచిందన్నావుగదా! ఆ లేచిపడటంలో కారుకు దెబ్బలు తగిలివుంటాయి!" ఆలోచిస్తూ అన్నాడు శ్రీనగేష్.

"అవును. అమ్మ గుండెకు ఎదర సీటు తగిలిందట. అక్కడి కక్కడే ప్రాణాలు విడిచిందట. ఎదర సీటులో నాన్నగారు, ఆ కారు గాలిలో పల్టీకొట్టినప్పుడు తలుపు ఊడిపోయి, తలక్రిందులుగా నేలమీదికి విసిరివేయబడ్డారు. ఆ పడడంలో తల బ్రద్దలై మెదడులో సున్నితమైన నరాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి ... అప్పటి నుండీ నాన్న అలా పరధ్యానంగా, ఒక్కొక్కప్పుడు అధిక ధోరణితో మాట్లాడేయడం మొదలు పెట్టారు, కాని దానిని పూర్తిగా మతి భ్రమణంగా జమకట్ట వీలు లేదు. ఎదుటి వ్యక్తులను గురించి మనం ఒక్కసారి చెప్తే మళ్ళీ మఱచిపోరు. కాని అదొక రకమైన వేదాంత ధోరణీ, మతి మాలిన మాటలూ ఏమిటో నేను స్పష్టంగా చెప్పలేను. తిని కూర్చోవడం మినహా మానవు

నికి మరికొన్ని వ్యాపకాలున్నవనే విషయం గుర్తింపులేదు. అహర్నిశలూ చనిపోయిన వారికోసం రకరకాలుగా బాధపడటం కాని ఆ బాధపడడంలోనే వున్నది ప్రస్తుతం సమస్య అంతా."

"అంటే? వివరంగా చెప్పు జయా."

జయ కొద్దిసేపు యోచిస్తూ మౌనంగా వుండిపోయింది

కడకు అంది: "చెప్పాలంటే భాష చాలదు బావా. కాని నా శక్తికొలదీ వివరించ యత్నిస్తాను. తన పరిధి దాటిపోతే పాడైపోతానని, తన కనుమరుగైనా ఆ ఎడబాబు భరించలేననీ, విదేశాలు వెళ్తే వికటించిపోతారనీ, విమానం ఎక్కితేనే కూలిపోయి చనిపోతానని భయంతో తన కళ్లెదుటే ఉట్టికెట్టుకుని అపురూపంగా పెంచుకుంటూన్న ముగ్గురు కొడుకులూ ఒకేసారి తనకళ్ళెదుటే నిష్కారణంగా మరణం పాలవ్వడం చూచిన ఆ పితృహృదయం ఆదెబ్బకు తట్టుకోలేక పోయింది. దానికి సాయంగా అసలే తలపై పెద్దదెబ్బ తగిలింది. రెండూ కలసి ఆయన మెదడును అయోమయం చేసేశాయి. ఆలోచనా, వివేకాన్నీ చాలవరకు హరించేశాయి.

"సుఖంగా తిని తిరుగుతారు స్నానం చేయడం, దుస్తులు వేసుకోవడం, పాదరక్షలు ధరించడం మొదలైన దినచర్యలన్నీ యథావిధిగా ఏ లోపం లేకుండా స్వయంగా చేసుకుంటారు. ఏ ఆసరా అవసరం లేదు, కాని అదేం విచిత్రమో ఒక్కొక్కసారి కుమారులు బ్రతికే ఉన్నట్లుగా, ఉద్యోగాలు చేస్తున్నట్లుగా మాట్లాడుతారు, తెలియని వారు వింటే నమ్మేస్తారు. కానీ కారు హారన్ వింటే, రైలుసవ్వడి చెవినపడితే, విమానంపేరు చెప్తే దడదడలాడిపోతారు! స్పృహతప్పి పడిపోతారు కూడా ఒక్కోసారి. ఏ హాస్పిటల్‌లో వుంచినా, ఎందరు స్పెషలిస్టులు ట్రీట్ చేసినా ప్రయోజనం కన్పించలేదు. అందుకే డాక్టర్ల సలహాపై కార్లు, రైళ్ళు, గందరగోళాలతో ప్రమేయంలేని ఈపల్లెకొచ్చాము. ఈ ప్రశాంత వాతావరణంలోనైనా ఆయనకు స్వస్థత కలుగుతుందని ఆశ;"

వింటూన్న శ్రీనగేష్ ఛటుక్కున తలెత్తి భావయుక్తంగా పరిశీలనగా చూచాడు జయశ్రీ వదనంలోనికి.

అర్థంకాని జయశ్రీ కొలదివిస్మయంతో ప్రశ్నించింది! ఏమిటి బావా?"

నిశ్వసించాడు శ్రీనగేష్. ఏమీలేదు, విధిలీలకు విస్మయం కలగుతుంది. మానవులం ఒక గమ్యాన్ని ఆశిస్తే విధి మరో ధ్యేయాల్ని చూపుతుంది. అర్థరహిత శృంఖలాలతో జీవితాన్ని అడుగడుగునా బంధనామయం కావిస్తుంది, కోరిన కోరికను దూరంచేసి వేదనను ప్రసాదిస్తుంది. కోరని పెన్నిధిని ఒడిలోవైచి చిలిపిగానవ్వుతుంది.''

అభిమానంగా, రోషంగా చూచింది జయశ్రీ, ఆత్మీయుడవని అన్ని విషయాలూ వివరిస్తే అలుసైపోయి చెప్పుతున్నావా బావా?"

"లేదుజయా'' నొసలు చిట్లించాడు శ్రీనగేష్. నేనటువంటివాడిని నౌనోకాదో నీకు తెలియదా? నామాటల సందర్భం కేవలం సింహావలోకనం మాత్రమే. పల్లెలంటే అసహ్యమైన నువ్వు పల్లెనుకోరి రావలసి వచ్చింది."

"శాశ్వతంగా ఉండిపోవడానికి వచ్చావా?"

"కాదనుకో, కాని వచ్చావు, కుమారులనూ, భోగభాగ్యాలనూ త్రాసులో తూస్తూ చినవ్యక్తి సామాన్యసుఖాన్నీ మనశ్శాంతినీ కూడా కోల్పోయి అల్లాడుతున్నారు మామయ్య. పల్లెప్రజలకే అంకితమైపోవాలని కోరుకున్న నేనూ, నాధ్యేయం బుద్బుదప్రాయమైపోయాం. పలురకాల సమస్యలతో జీవనస్రవంతి బహుముఖియైపోయింది.

ఈ బహుదారి ఆయువెంతో, ఇంకెన్ని మలుపులు తిరుగుందో, ఎన్నిచీలికలు చీలుతుందో తెలియదు."

చిత్రంగా కదులాడాయి జయశ్రీ కనుపాపలు. ఏమిటిబావా, నీలో ఇదివరకటి ఛలాకీతనంలేదు. ఏం జరిగింది?"

నవ్వేశాడు నగేష్. "ఏమీలేదు. పద మామయ్యను చూద్దాం."

అతదేదో చెప్పడంలేదనీ, ఆ నవ్వులో జీవంలేదనీ గ్రహించింది జయశ్రీ. ఇక రెట్టించి అడిగినా అతడు చెప్పడని తెలుసు.

మేడమెట్లు ఎక్కుతూ ఎక్కుతూ మధ్యన ఆగి వెనదిరిగింది జయశ్రీ. రెండుమెట్లు క్రిందిగా వస్తూన్న నగేష్‌కూడా ఆగాడు.

"చూడుబావా. నువ్వూ ఇంచుమించులా అన్నయ్యల వయసువాడవే అటువంటి వారిని చూస్తే నాన్నగారి ధోరణి మరీ విపరీతంగా వుంటుంది ... ఇంతగా చెప్తూనందుకు మాత్రం నువ్వేమీ...అనుకోకూడదు, పరిస్థితి అటువంటిది." జయశ్రీ వదనంతో ఒకవిధమైన జాలి కన్పట్టింది.

గంభీరంగా అన్నాడు నగేష్, "అనుకోవడానికేమీలేదు, నువ్వీవివరాలు చెప్పడం వల్ల నాకు కేస్ ట్రీట్ చేయడం తేలికౌతుంది.''

"ఇదే నాన్నగారిగది" అంది మేడమీది గదిని చూపి, జయశ్రీ,

డాక్టర్ యావలేనిల్చుని ఆమెను లోనికి వెళ్ళమని సైగజేశాడు. జయశ్రీ గడప దగ్గరఆగి, కర్టెన్‌కొద్దిగా తొలగించి చూచింది. శ్రీపతి ఎడమచేతిలో ఏదో పుస్తకం వుంది, అది చదువుతూనే మధ్యమధ్య ఎదుటి చదరంగం బోర్డుపై ఇరుపార్శ్వ బలాలనూ ఒక్కడే నడిపిస్తూ ఆడుతున్నాడు.

ఒక్కసారి శ్రీనగేష్ దెసచూచి మరుక్షణంలోనే లోనికి ప్రవేశించి, తిన్నగా పోయి తండ్రి ఎదుట మరోకుర్చీలో కూర్చుంది జయ.

"ఆం, వచ్చావా అమ్మాయ్! ఏం చేస్తున్నా వింతవరకూ?" అనడిగాడు శ్రీపతి కుమార్తెను.

"క్రింద ఏదోపనిలో ఉన్నాను నాన్నా. అంతా క్రొత్తయిల్లుకదా? సర్దుతున్నాను,''

"ఛ ఛ ఛ ఛ! పుస్తకం బల్లపైకి విసిరేసి అటూ యిటూ చిరాగ్గా చూచాడు శ్రీపతి, వెధవ పనులూ. సర్దడాలూ ఎందుకమ్మా నీకు? జీవితం ఎంత విలువైంది, ఎంత అమూల్యమైంది. నీలాటి పిల్లలు చేయవలసిన ఘనకార్యాలు ఎన్నెన్నో ఉండగా..."

ఇక ధోరణిలో పడిపోతున్నాడని గ్రహించిన శ్రీనగేష్ మెల్లగా లోనికి ప్రవేశించాడు.

"ఎవరూ?'' మాటలు ఆపి ప్రశ్నించాడు శ్రీపతి. కనుబొమలు ముడిచి.

'నమస్కారమండి." నమ్రతతో చేతులు జోడించాడు శ్రీనగేష్,

"శుభం. రండి, కూర్చోండి," కుర్చీ చూపాడు శ్రీపతి. ''మీపేరేమిటి?"

ముఖముఖాలు చూచుకున్నారు బావా మరదళ్లు.

"నాపేరు శ్రీనగేష్ అండి."

"ఓహో! అయితె యింతకూ ఏంపని మీకిక్కడ? వేషంచూస్తే ఈ పల్లెలో మనిషిలా కనబడ్డంలేదు. పట్నంనుండి వచ్చావేమిటి? ... ....అఁ! తెలిసింది!'' శ్రీపతి ఎగిరి గంతేశాడు ఏదో విషయం హఠాత్తుగా గ్రహించినంత గర్వంతో. అయితే ఢిల్లీనుంచి వస్తున్నావా? మా అబ్బాయిలు పంపించారా? బాగున్నారా? ఏం చెప్పారు? మాట్లాడవేమయ్యా?''

అప్పటికి కాస్త ఆలోచించి కర్తవ్యం నిర్ధారించుకున్న నగేష్ "ఔనండి. అబ్బాయిలందరూ బాగానే వున్నారు." అన్నాడు,

"హుఁ! బాగానే వున్నారట బాగా" కోప నిష్ఠూరతలు ధ్వనించాయి శ్రీ నగేష్ మాటలలో " అలా కాకి కబురు పంపక పోతే, కాస్త ఈ తండ్రి ఎలాగున్నాడో ఏమిటో వచ్చి చూడకూడదూ? కనీసం ఓ ఉత్తరంముక్కైనా ఏడవకూడదూ?ఏమిటో- ముసలాళ్ళకున్న మమకారాలు కుర్రాళ్ళకుంటాయా? అబ్బే.' చప్పరించేశాడు.

గొంతు సవరించుకుని చెప్పాడు శ్రీనగేష్ "రావాలనే అనుకున్నారు కాని సెలవు దొరకలేదండి. దొరికాక వస్తారు"

దొరకదోయ్. ఎలా దొరుకుతుందీ?" కోపం. నిరసనా తాండవించాయి శ్రీపతి కంఠంలో. "ఉన్న వూళ్ళో ఈ మాత్రం దొరకకపోయయనా, అంతదూ ... రం పోయి ఊడిగాలు చేయడం? ఆమాత్రం యింగిత జ్ఞానముండక్కర్లా?''

ఆ ఆవేశపు ప్రలాపనను అరికట్ట ప్రయత్నించి, విఫలత పొందింది జయశ్రీ. అదేమిటి నాన్నా? ఈయనెవరో మధ్య మనిషి! ఈయన నడిగితేంఎలా?''

''నువ్వుండమ్మాయ్. నీకు తెలియదు. వాళ్ళకి స్నేహితుడేగా? పోయి బుద్ధి చెప్తాడితడు.'' అంటూ కూతురి మాట త్రోసిపారేశాడు.

'మౌనం వహించ' మన్నట్టు సైగ జేశాడు శ్రీనగేష్ జయశ్రీకి అంతతో జయశ్రీ మరిమాటాడకుండా కూర్చుంది.

''మనలో మాట_చూడు నాయనా," అతి ఆత్మీయతతో సంభాషణ ప్రారంభించాడు శ్రీపతి. ''చూడు నాయనా. పోనీ నా సంగతి అటుచు వాళ్ళ సంగతి? ఆ ఉద్యోగాల కంటె ఇక ప్రధానం లేదూ జీవితానికి? ఒకడుకాదు ఇద్దరు కాదు_ముగ్గురు వెధవలూ నాతో చెప్పాచేయకుండా అలా పారిపోవడమే? వెధవ ఢిల్లీ_అమెరికాలో వుంటేమాత్రం? నేను తలంచుకుంటే జుట్టట్టు కీడ్చుకొస్తాను. కానీ కానీ ... రైలెక్కాలి, విమాన మెక్కాలి. అయ్యా బాబోయ్!" ఒక్కసారి ఎగిరి కుర్చీలో కాళ్ళు పైకెట్టు కూర్చున్నాడు శ్రీపతి, భయంతో కళ్ళు పెద్దవిచేసి.

"నేను ఇప్పుడు విమానంలోనే వచ్చానండీ యిక్కడికి!" అన్నాడు శ్రీనగేష్. శ్రీపతి ముఖాన్ని కదలికలనూ పరిశీలనగా పరికిస్తూ.

"ఊఁ! అయితే విమానమెక్కికూడా బ్రతికి బాగున్నావన్నమాట?" కనుబొమ్మలు చిట్లించాడు శ్రీపతి. మళ్ళీ ఈక్రొత్త ప్రస్తావనలో పాతభయంతగ్గి ప్రలాపన ప్రారంభమైంది. "మీయుపకులున్నారే _ వట్టి మూర్ఖులు! మీకు చావంటే భయం లేదు. చచ్చినాకీర్తి వుండాలంటారు, వెధవ అద్వైతసిద్ధాంతం! అసలు తోచినట్టు చేసేయడమేకాని మీకు ఆలోచించేంత తెలివి లెక్కడ ఏడిశాయీ? కాకుంటే _ ఇన్ని వాహనా లుండగా విమానమే కావలసి వచిందటోడ్ నీకు ప్రయాణం చేయడానికి? ఆకాశంలో ఎగిరేవాడి యాపరేజ్ లైఫ్ ఐదు నిమిషాలు. ఏ నిముషానైనా నేలకూలి, మరు క్షణంలో మరణిస్తావ్, జాగ్రత్త!"

జయశ్రీ విసుగ్గా లేచిపోయి, కిటికీ దగ్గరనిలబడి బయటకు చూడసాగింది.

ఈసారి మరో విధంగా మళ్ళింపజూచాడు డాక్టరు. శ్రీపతి ధోరణిని. "చూడండి రావుగారూ. మీ ఆరోగ్యం ఎట్లావుంది?"

"అదేమిటోయ్ అర్థంలేనిమాట? ఇప్పుడసలు నా ఆరోగ్య ప్రసక్తి దేనికి, నే నేదో అతిముఖ్య విషయం మాట్లాడ్తూంటే? అఁ, నీ పేరేమిటన్నావ్?"

''శ్రీనగేష్ అండి."

''ఇదుగో, ఇదోరోగం ఈకాలపు యువజనానికి, చక్కటి పేర్లని కట్‌షాట్లు చేసేస్తారు. చక్కగా 'నాగేశ్వరరావు' అని అందంగా వుంచక నగేష్మిటోయ్ నగేషూ, ఉషూ, గిషూను? నాపేరుచూడు చక్కగా శ్రీపతిరావు!"

తండ్రి మాటలనూ, నగేష్ నిస్సహాయ దృక్కులనూ పరికిస్తూన్న జయశ్రీకి అంతటి విచారస్థితిలోనూ ఫక్కున నవ్వు వచ్చింది.

శ్రీనగేష్ కుర్చీనుంచిలేచాడు నెమ్మదిగా. అతడివదనం గంభీరంగా వుంది. ఏ భావమూలేదు.

"మరి వెళ్తానండి నాకు సెలవిప్పించండి." అన్నాడు నమస్కరిస్తూ.

''అఁఅఁ. మంచిది వెళ్ళిరా. కాస్త మా అబ్బాయిలతో ఘట్టిగా చెప్పండి, వాళ్ళ కోసం నేను పరితపించి పోతున్నానని,

వైధవలు, వాళ్ళే కాకుండా తల్లిని కూడా తీసుకుపోయారు. ఇక్కడ అమ్మాయీ, నేనూ ఎంత యిబ్బంది పడ్తున్నాము! త్వరగా రమ్మని చెప్పండి."

అలా చెప్తూనే తిరిగి చదరంగం ఆటలో నిమగ్నమైపోయాడు.

ఒక్కక్షణం అటుచూచి, తానూ మెల్లగా గదివదలి అవలకు నడిచింది జయశ్రీ.

ఇద్దరూవచ్చి కిందగదిలో కూర్చున్నారు చాలసేపు ఎవరూ మాట్లాడలేదు.

నీరస స్వరంతో జయశ్రీ ప్రశ్నించింది. "చూచావుగా అంతా?"

"ఊఁ." నగేష్ మస్తిష్కం గాఢాలోచనా నిమగ్నమైవున్నట్టు అతడి నొసలే స్పష్టం చేస్తూన్నది. "తనకు ముగ్గురు కుమారులు, భార్య ఉన్నారన్న సంగతిని మాత్రం ఆయన మఱచిపోలేదు!" అన్నాడు సాలోచనగా.

"తగ్గుతుందంటావా" ఆశగా ప్రశ్నించింది జయశ్రీ. శ్రీనగేష్ వదనంలోకి చూస్తూ.

గంభీరంగా అన్నాడు నగేష్: "నేను చేసేది కేవలం మానవయత్నం. దైవ సహకారం ఉండాలి మరి. ధైర్యంగావుండు నేను మళ్ళీ రేపు వస్తాను."

"................."

"ఇవ్వాళ ఊరికే చూడడానికేగా నేను వచ్చింది? ఇంటికిపోయి తీరికగా కొంత ఆలోచించాలి, అదీగాక నేను యివ్వాళ రావడమే అసలు చుక్కెదురుగా వున్నది."

"అంటే"?"

"నా యీ వేషం చూడగానే ఆయన ధోరణి పట్నవాసాలమీదికి మళ్ళిపోయింది. రేపు సాధారణ పల్లెయువకుని దుస్తులలో వస్తే ఎలాగుంటుందో చూడాలి." అంటూ చిన్నగా నవ్వాడు.

"అవును, నిజమే అనుకుంటాను. కొందరితో నాన్నగారు మామూలుగానే మాట్లాడుతారు."

ఆలోచనా పూర్వకంగా అన్నాడు శ్రీనగేష్: "పూర్తిగా మతిపోయినా యింత ప్రమాదంలేదు. కాని సగం అతితెలివి. అజ్ఞానంగా ఉంది. అది మరీ ప్రమాదం, అయినా ప్రయత్నలోపం వుండదనుకో... మరినేను వెళ్తాను."

"ఊఁ!"

"అమ్మాయ్!" పెద్దకేక పెట్టాడు శ్రీపతి.

క్రింద గదులలో ఏవో పనులలో నిమగ్నమైవున్న జయశ్రీ త్వర త్వరగా తండ్రిదగ్గఱకు వెళ్ళింది.

"ఏం నాన్నా?"

"ఇదిగో, త్వరగా రమ్మని మీ అమ్మకూ అన్నయ్యలకూ ఉత్తరం వ్రాశాను. పోస్టుచేయించు."

నిస్సహాయం చూస్తూ తప్పనిసరిగా అందుకున్నది జయశ్రీ. "వెళ్ళు. త్వరగా పంపించు."

వెళ్ళి పది నిమిషాలలో తిరిగి వచ్చింది జయశ్రీ. ఈసారి జయశ్రీ ప్రవేశాన్ని గమనించనేలేదు, తన పుస్తక పఠనంలో లీనమై పోయివున్న శ్రీపతి.

"చూడు నాన్నా." మెల్లగా అతడి పుస్తకం తనచేతికి తీసుకుంది జయశ్రీ. "ఎప్పుడూ ఇకయింతే అయితే ఎలానాన్నా? కాస్తయింట్లోనైనా అటూ యిటూ తిరిగి ఏదో ఒక పని చూచుకోకపోతే ఎలాగ?"

"ఏం పనుందమ్మా? ఏంచెయ్యమంటావ్ నన్ను?"

"ఏం పనుందని అడుగుతారేమిటి నాన్నా? నేనొక్కతెను అన్ని విషయాలూ చూచుకోలేక ఎంతశ్రమపడి పోతున్నాను? ఇటు యింట్లోపనీ, నౌఖర్లూ చాలక అటు పొలం పనుల విషయం కూడా నేనెలా చూడగలను చెప్పండి?"

"నిజమేనమ్మా, నాకీసంగతి తట్టనేలేదె."

"మరీ అలాగదిలోనే కూర్చుంటే ఏ విషయమూ తట్టదు; కాస్త అలా బయటకు వస్తుంటే బాగుంటుంది. ఇన్నాళ్ళూ మనం ఎక్కడెక్కడో వుంటూంటే పొలాల అతీగతీ కనుక్కొనే నాథులు లేక రైతుల యిష్టప్రకారం సాగిపోతూన్నది. మనం యిక్కడికొచ్చాం గనుక కాస్త యిప్పుడైనా వాటి ఆజ కనుక్కొంటే..."

"అవును నిజమే. అలాగేలే... ఇంతకూ మనం యిక్కడకెందు కొచ్చినట్టూ అంటా. ..." ఆలోచన తెగక తలతడుముకుంటూన్న తండ్రికేం సమాధానం చెప్పాలో తెలియక తికమకపడుతూండగా, ఆపద్బాంధవునిలాగా ప్రవేశించాడు శ్రీనగేష్.

ఆనందంతో, పరమ సంతోషంతో ఆహ్వానించింది జయశ్రీ.

తెల్లని గ్లాస్కో లాల్చి, పంచె, పైన కండువాతో ప్రవేశించిన ఆనిర్మల సౌందర్యం మూర్తిని చూస్తేనే ఏమిటో కొంతంత ధైర్యం వచ్చి, నూతన బలాన్ని సంతరించుకున్నది జయశ్రీ మది.

ఆగంతకుని పరకాయించి చూచాడు శ్రీపతి.

"నమస్కారమండి, ఏంచేస్తున్నారు?" అంటూ వచ్చి దగ్గఱ కూర్చున్నాడు శ్రీనగేష్.

"ఓహ్, నువ్వటోయ్!" తేలికగా నవ్వేశాడు శ్రీపతి. "వేషం మారింది. అంచేత చూడగానే గుర్తుపట్టలేదు."

చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు శ్రీనగేష్. కాని శ్రీపతికి జ్ఞాపకశక్తి గుర్తింపు జ్ఞానమూ వున్నందుకు లోలోన కొంత ఆశ్చర్యం, మరి కొద్ది సంతోషంకూడ కలిగాయి, కాని పైకి వ్యక్తమవ్వకుండా జాగ్రత్తపడ్డాడు.

"నీకు ఏమిటయ్యా ఇక్కడ పని?" ప్రశ్నించాడు శ్రీపతి.

అందలి భావం ఏమిటో సరిగా అర్థంకాక కొద్దిగా ఖంగారు పడవలసివచ్చింది శ్రీనగేష్.

"ఆయన డాక్టర్ నాన్నా. ఈ వూరే వారిది." త్వరగా చెప్పింది. జయశ్రీ.

"ఓహ్! బాగుంది. అయితే ఈ పల్లెటూళ్ళో ... డాక్టరా ఏమిటి?"

"ఏదో కాలక్షేపమండీ; అంతే ఇదొక వృత్తిగానూ, రాబడికోసమూ కాదండి."

"ఇదెక్కడి వింతమనిషివయ్యా? కాలక్షేపానికి డాక్టర్‌పని చేస్తున్నావా? లేక మానవసేవ ఆశయంగా పెట్టుకున్నావా?" ఆశ్చర్యంతోపాటు హేళనకూడ మిళితమై ధ్వనించిందాతడి కంఠస్వరంలో. "ఈ రోజుల్లో ఇదోరోగం. ప్రతివాడికీ ఒకొక్క ఆదర్శ మనిచెప్పుకోడం ఫాషనైపోయింది. ఎందుకొచ్చిన ఆదర్శాలు? మనిషై పుట్టాక చక్కా రెండుచేతులా ఆర్జించాలి."

శ్రీనగేష్‌కు కోపం రాగలదని భయపడింది జయశ్రీ. కాని అతడి వదనంలో గాని సంభాషణలోగాని ఎక్కడా అటువంటి ఛాయలే కానరాలేదు. చాలా ఓర్పుగా, గంభీరంగా, శాంతంగాచెప్పాడు. "నేనుసైన్యంలో డాక్టరుగా పనిచేసివచ్చాను కొన్నాళ్ళు. ఏదో విధంగా వచ్చిన విద్యతో పదిమందిక్షేమం కొఱకు పాటుబడాలనే కోరిక మినహా, ఈ వృత్తిపై పెద్దరాబడి రావాలనేకోరిక లేదండీ నాకు."

"ఆశ్చర్యంగా వుందే? ఈకాలపు యువకులంతా మహానగరాలలో వుండాలని ఉబలాటపడ్తూంటే నువ్విలా కావాలని పల్లెటూరి కంకితమైపోవడం విశేషమే! అదీ ఒకందుకు మంచిదేలే. ఇక్కడ విమానాలూ, కార్లూ రైళ్ళూ వుండవు. అంచేత వాటివల్ల చస్తామనే బెడద వుండదు!"

"దానికేంగాని కాస్త అలా ఎటైనా షికారు వెళ్దాం, వస్తారేమిటి?"

"షికారుకా?"

"ఔనండీ. అలాపొలాలవైపుకాస్తనడిస్తే మనస్సు కాహ్లాదం, ఆరోగ్యంకూడ."

"సరే నడవండి." తేలికగానే అంగీకరించాడు శ్రీపతి.

"అయితే, దుస్తులు మార్చుకుని వెళ్ళండి నాన్నా." అంటూ జయశ్రీ తండ్రిని

"అలా అలా; ఇప్పుడే వచ్చేస్తాను." మరో గదిలోకి పోయాడు శ్రీపతి; తండ్రి నిష్క్రమించాక జయశ్రీ శ్రీనగేష్‌వైపు తిరిగింది. "నీ ఊహ నిజమైందే బావా. నిజంగా చాలా ప్రవీణుడవని ప్రత్యక్షంగా నిరూపించావు. ఈరోజు నీ దుస్తులు నాన్న మనస్సు నేమీ కలవరపరచలేదు."

మందహాసంచేసి ఊరుకున్నాడు శ్రీనగేష్.

"ఇవ్వాళ ఏం నిర్ణయాని కొచ్చావ్? తగ్గుతుందా బావా?"

"తప్పక!" స్థిర ధైర్య చిత్తంతో అన్నాడు శ్రీనగేష్. "త్వరలోనే కూడ తగ్గించగలనని భావిస్తున్నాను. ఆయనకు మతి కొద్దిగా భ్రమించినమాట వాస్తవమే. కాని, విపరీతంగానూ, భయంకరంగానూ యింకా పరిణమించలేదా మతిభ్రమణం. విశాఖపట్టణం, మద్రాసు, కలకత్తాలలో యిదివరలో మామయ్యను ట్రీట్ చేసిన స్పెషలిస్టులకుకూడ రాత్రే ఉత్తరాలు వ్రాశాను-- ఈయన కేస్‌గురించిన వివరాల నిమ్మని; ఓ వారంలో రావచ్చు జవాబులు."

"చాలా శ్రమపడుతున్నావ్ బావా." జయశ్రీ నేత్రాలలో కృతజ్ఞత మెరిసింది.

నవ్వాడు శ్రీనగేష్. "అది నా బాధ్యత. ఆయన నీకు తండ్రి, నాకు మామ; మీదుమిక్కిలి యిది నా వృత్తి. ఇప్పుడు అలా బయటి ప్రపంచంలోకి కాస్త ఆయనను తీసుకువెళ్తే, మరింత వివరంగా ఆయన మనోస్థితిని తెలుసుకోగలననుకుంటున్నాను. ఆ విషయం తర్వాత తీరిగ్గా మాట్లాడుతా."

"పోనీ నన్ను రమ్మంటావా బావా! మాటిమాటికీ రావడం నీకు శ్రమేమో?"

"అదేనువ్వు నాతో అనవలసిన మాటేనా జయా? ఆయన 'కేస్' నేను తీసుకున్నాక ఏ విధమైన శ్రమనైనా భరించాలి గదా? అదికాక చిన్నదానవు, ఇంట వుండే గౌరవ స్త్రీవి, నా మరదలివి-- నిన్ను రప్పించుతానా? అంత మర్యాద తెలియనివాడినా?"

జయశ్రీ వదనం లజ్జారుణితమైంది. ఆమె నేత్రాలు సంతోషానంద పరవశతనందాయి. కృతజ్ఞతను వదనంలో ప్రదర్శించటమే కాని, భాషారూపంలో వ్యక్తీకరింపలేక మౌనం దాల్చిందని శ్రీనగేష్ గ్రహించకపోలేదు.

"ఇప్పుడు మామయ్యా, నేనూ వ్యాహ్యాళి వెళ్ళివస్తాం. ఆతర్వాతనో, రేపో నేను మళ్ళీ నీతో మాట్లాడుతాను."

"కూడా నౌఖర్నెవరినైనా పంపించనా?"

"ఎందుకు?"

"షికారైన తర్వాత నాన్నగారికి కాస్త కూడవుండి తీసుకొస్తాడు."

"నీకాభయమేమీ అక్కర్లేదు. నేనాయనను యింటివద్ద దిగవిడిచే వెళ్తాను. మేమిద్దరమూ ఒంటరిగా వెళ్తేనే, ఆయనను మరింత అర్థం చేసుకోగలననే అభిప్రాయంతో వున్నాను. అదుగో, మామయ్య వస్తున్నారు; మేం వెళ్ళివస్తాం."

"వెళ్తున్నా నమ్మా అమ్మాయ్." అన్నాడు శ్రీపతి డాక్టర్ని అనుసరించి బయటకు నడుస్తూ.

వెళ్ళిపోతున్న ఆ ఇరువురినీ చూస్తూ నిలబడిన జయశ్రీ మదిలో ఎన్నో అవ్యక్త ఆలోచనలు -- 'నాన్నగారికి ఈ మతి చాంచల్యం నెమ్మదిస్తుందా? ఈ పల్లెనువదిలి పట్నమెప్పుడు వెళ్తాము? చనిపోయి వాళ్లెలానూ చనిపోయారు. మిగిలిన నా జీవితంలోనైనా వసంతం చిందుతుందా?

'ప్రాణప్రదంగా, స్నేహితునిలా ప్రవర్తిస్తున్నాడు బావ; ఎంత సౌమ్యుడు! ఎంత సహృదయుడు పాపం. ఇంతా చదివి ఈపల్లెలో ఎలా వుండగలుగుతున్నాడో!

'ప్చ్! ఓ వినోదమూ, స్నేహితులూ లేకుండా ఏకాంతవాసం ఎలా గడపను? ఈ పల్లెలో ఎవరితో మాట్లాడను? అత్తయ్య గడపదాటి రాదు. వెళ్ళాలంటే నాకు అభిమానం, అహంకారం అడ్డువస్తున్నాయి. ఇక మిగిలిన జనులతో ఎలా కలియను? ఏమి జరుగబోతున్నదో -- నా జీవితం ఏమి కానున్నదో!'

(సశేషం)

# సంప్రదాయక విలువలు - విద్య

డాక్టర్ జాకిర్ హుస్సేన్

మానవ వ్యక్తిత్వంలోని అవిభాజ్యమైన భావాలు మూడు విధాలైన విధులను వ్యక్తంచేస్తాయి. భౌతికం లేక ఉద్భిజం; మానసికం లేక పాశవికం; మేధాసంపత్తి, లేక విశేష మానవత్వం. భౌతికవిధులు తమంత తాము మొదట వ్యక్తమౌతాయి. భౌతిక, మానసిక అనుభవాలద్వారా పిల్లలు తమ ప్రథమ సంతృప్తి అసంతృప్తులను అనుభవిస్తారు. ప్రత్యేక వస్తువులు చర్యలను గూర్చిన తమ యిష్టాయిష్టాలను వ్యక్తంచేయడం, మదింపు చేయడం, వాటికి విలువలు కట్టడం అప్పటి నుండే ప్రారంభిస్తారు. తమ అనుభవాల ద్వారా మంచి, చెడులను మదింపుచేసే విధానంతో మనోవికాసానికి మూలప్రాతిపదిక ఏర్పడుతుంది. యీ విలువల మదింపు క్రమంగా బాలల మనస్సులలో హత్తుకపోయి తత్ఫలితంగా లక్ష్యము అవధుల జిజ్ఞాస ప్రారంభమయి వారి మానసిక జీవితంలో ఒక ముందడుగు ఏర్పడుతుంది. అయితే ప్రారంభదశలో కలిగే అనుభవాల విలువలు కేవలం ఇంద్రియజనితమైనవి. సంతోష, విషాదాలు, సౌకర్య అసౌకర్యాలు, శారీరక స్వేచ్ఛ, శారీరక నిర్బంధాలు, ఇంద్రియసుఖం, ప్రకోపాలు ప్రామాణికంగా ఉంటాయి. ఇదేస్థాయిలోని అనుభవాలు, మానవులతో సమంగా కొన్ని పెద్ద జంతువులలోకూడ ఉంటాయి. ఈ స్థాయితోనే కొందరు మానవులు సంతృప్తిపడి ఎదగకపోవడం దయనీయమైన విషయం.

అయితే మానవ వ్యక్తిత్వం, మేధాసంపత్తి, నైతిక విలువలుగల మూడవ స్థాయికి అభివృద్ధి చెందుతుంది. ఈ స్థాయి ద్వారా కలిగేసంతృప్తి వీటి విలువల అనుభవాలకు దారితీస్తుంది. ఇవి మరోవిధంగా ఉంటాయి. శారీరకఆరోగ్యం, ఇంద్రియ సుఖాలకు బదులుగా సత్యం, శివం, సుందరం న్యాయం అనుభూతిలోకి వస్తాయి. మానవవ్యక్తిత్వం పూర్తిగా వికసించడానికి దోహదం చేసేసాధనగా వినియోగపడే విద్యకు శాశ్వతవిలువలుగా వ్యవహరింపబడే యీప్రత్యేక మానవ విలువలతో సంబంధం ఉన్నది.

## విద్య ప్రధానోద్దేశం:

మానవుడు, ప్రత్యేకంగా అతనిలోని మానవత్వంతో సంబంధం కలిగిఉంటమే విద్యయొక్క ప్రధానోద్దేశం. కొందరు వ్యక్తులు, వ్యక్తుల బృందాలు తమ మేధాశక్తితో ఏర్పాటుచేసిన సంస్కృతి సంపద ద్వారా మానవునిలో నిక్షిప్తమైఉన్న విలువలను వికసింపజేయడానికే విద్య ఉపయోగపడుతుంది. అందువల్ల బాహ్యంగా ఉన్న సంస్కృతిని వ్యక్తి అంతఃకరణలో పునరుద్ధరింపజేయుడానికి విద్య దోహదం చేస్తుంది. ఈ విలువలు అనుభవంలోకి వచ్చినప్పుడు వాటితోపాటు శక్తి, సంపూర్ణత్వం, విలక్షణతలు కూడ అనుసరిస్తాయి. వాటికి కట్టుబడి, లక్ష్యసాధనకు మానవుడు కృషిచేస్తాడు. వ్యక్తిజీవిత పరమావధి, ఆశయాలు, విలువల నిర్ధారణ, ఆశలను తీర్చిదిద్దడంలో అవి ప్రముఖ అంశాలుగా వినియోగపడ్తాయి. నిరాశాంధకారంలోను, నిషాదంలోను నిశ్చలమనస్సుతో ముందడుగు వేయడానికి వీలుగా దీపశిఖను వెలిగించే తీరుగానే వ్యక్తి జీవితంలో విద్య వికాసం కలిగిస్తుంది. ప్రతివ్యక్తి హృదయంలో విజ్ఞానజ్యోతిని వెలుగించడమే విద్యయొక్క పవిత్ర కర్తవ్యం. సంస్కృతి, సాహిత్యం, కళ, శాస్త్రవిజ్ఞానం, మతం, నైతిక విలువలు, న్యాయశాస్త్రం మార్గాల ద్వారామాత్రమే యీపని సాధ్యమవుతుంది.

విషయాన్ని తెలియ జెప్పినంత మాత్రాననే యీ శక్తిని వినియోగించుకో గలుగుతారని అనుకోరాదు. సమాచారం అందజేయడంతో సరిపోదు. విషయసాధనలో వారు పూర్తిగా నిమగ్నులయి, అందులో అనుభవాన్ని గణించాలి. సమస్యను ముఖాముఖి ఎదుర్కొని, అనుభవం గణించి సాధించడంలో విద్యముఖ్యంగా తోడ్పడాలి. విద్యార్థి మనస్సుకు, సంస్కృతి సంపదలో నిక్షిప్తమైన బాహ్య విలువలకు మధ్య విద్య సంధానకర్తగా ఉపయోగపడాలి.

ఈ మధ్యవర్తిత్వాన్ని ఏవిధంగా జరపాలనేదే విద్యావిధానం ముఖ్యసమస్య. అనుభవం, పరిశోధనలకు బదులుగా విషయసంబంధమైన సమాచారం అందజేయాలనే వాదాన్ని ఫలప్రదమైన, సార్థకమైన, విద్యావిధానం దృఢంగా ఎదుర్కోవాలి. సంస్కృతిపరమైన సంప్రదాయక విలువలను యువతరంలో ప్రచారం చేయాలనే ఆదుర్దాతో అనుభవం, పరిశోధనలను ప్రక్కకునెట్టి సమాచారం అందజేయడంతో సంతృప్తిపడితే దానిఫలితంగా మిడిమిడిజ్ఞానం, కృత్రిమత్వం ప్రబలే ప్రమాదం కలుగుతుంది.

## న్యాయసమ్మతమైన ఎంపిక:

సంప్రదాయకవిలువలద్వారా విద్యాబోధన జరిపే విషయంలో న్యాయసమ్మతమైన ఎంపిక, విద్యార్థి మానసికస్థితికి అనుగుణంగా విలువల అనుభవాలను పొందే పరిస్థితులను కల్పించి ఈ విలువ పూర్తిగా జీర్ణించే మార్గాలను రూపొందించడం చాలా అవసరం.

మన సాంస్కృతిక విజయ పరంపరల నుంచే విషయాలను ఎంపిక చేయడంలో విజ్ఞత పాటించాలి. చరిత్ర ఒకతరగని నిధి. మానవుని జీవితపు వ్రేళ్ళు చరిత్ర గర్భంలోకిచొచ్చుకొనిపోయి గతకాలంలోకి బాగా విస్తరిస్తాయి. ఇవి భవిష్యత్తులోకి అదేస్థాయిలో ఉన్నతి నొందుతూ కాలవాహినికి అతీతంగా నిల్చిపోతాయి. అందుకే చరిత్రనుండి విద్యకు ఉపయుక్తమైన విషయాలను ఎన్నిక చేసుకోవాలి.

గతం అపారమైనది. దీనినుండే విద్యా విషయాలు ఎన్నుకోవాలి ఇక్కడే గురుతరమైన, అతిక్లిష్టమైన బాధ్యత కలుగుతుంది. అభీష్టంపై ఎన్నిక ఆధారపడి ఉంటుంది ఈ అభీష్టానికి కొన్నిసూత్రాలూ, విచక్షణా ఉండడం చాలా అవసరం. కొందరు అతిపురాతనమైన విషయాలను ఎన్నుకుంటారు. మరికొందరు అధునాతనమైనవి, ఇటీవలివి ఎన్నుకుంటారు ఇంకా కొందరు ఉమ్మడి జాతీయతవి, ఉమ్మడి సంస్కృతికి చెందిన విషయాలను ఎన్నుకుంటారు. క్రొత్తపాతల మేలికలయిక గల సంస్కృతికిమనంవారసులయ్యాము.ఇందులో ద్రావిడ ఆర్య, అరబు, తురుష్క, మంగోలి, యూరపియన్ సంస్కృతులు మిళితమై ఉన్నాయి. హిందువులు, బౌద్ధులు, ముస్లిములు, క్రైస్తవులు, సిక్కులు, పార్సీలు దోహదంచేశారు పాత, క్రొత్తలు మంచిచెడుల, బాషావర్గాల దృక్కోణంతో మన చరిత్ర మంచిచెడులను నిర్ణయించలేము. వాస్తవం, కృత్రిమం, శాశ్వతం, అస్థిరం, శాశ్వతవిలువలు, తత్కాలమైన విషయాల ప్రాతిపదికగా మాత్రమే నిజమైన వ్యత్యాసాలను కనగొనాలి. మనకు సంక్రమించిన యీ అమూల్య సంపదను పరిశోధించి వృద్ధిలోకి వచ్చే యువతరానికి అందించే విధంగా మన విద్యావిధానం, సంఘంలోని మేధాసంపన్నులు కృషి చేయాలి. మనకు సహాయపడే వారసత్వాన్ని మనను కృంగదీసే లేక అభ్యున్నతి కలిగించే సంప్రదాయాలలో ఏది మంచో- ఏది చెడో విచక్షణచేసే శక్తిని కలిగించేవిధంగా విద్య ఉండాలి. అభివృద్ధి, ఔన్నత్యం సుగుణాలు నిబిడీకృతమై ఉండి శాశ్వత విలువలు సంతరించుకున్న సంప్రదాయమే సరి అయిన విద్య, అభివృద్ధిని కుంటుపరచే సంప్రదాయం హానికరమైనదే గాక నిర్వీర్యం చేస్తుంది. వ్యక్తి జీవితానికి, సమాజ క్షేమానికి బాహ్యమైన శాశ్వత విలువలు మార్గం ఏర్పరుస్తాయి సంపూర్ణ శాశ్వత విలువను పొందడంతో పరిపూర్ణం లభిస్తుందని భావించాలి.

మన చరిత్రలోని సంపూర్ణ విలువలను గుర్తింపజేసే విధంగా నేటి యువతరాన్ని మనం తీర్చిదిద్దాలి. ఈ విలువలలో కొన్నిటిని అనుభవంలోకి తెచ్చుకోవాలనే జిజ్ఞాస, శక్తి వారిలో కల్పించాలి. ఆ విధంగా తను తన పరిసర ప్రాంతాలలోని సత్యం, శివం, సుందర, న్యాయంవంటి విలువలను పొందడానికి మార్గం ఏర్పడుతుంది.

మన ప్రస్తుత జాతీయ జీవితంలో ప్రత్యేక శ్రద్ధతో గమనించాల్సిన విలువ ఒకటుంది. అదేమన రాజ్యాంగంలో చేర్చుకోబడిన న్యాయం, ధర్మం. ధర్మానికి, న్యాయానికీ రాజ్యాంగం లోబడి ఉండాలనే మన సంప్రదాయం నేర్పుతున్నది. జాతీయ ప్రభుత్వం ఏర్పడిన యీ కొద్ది కాలంలోనే విద్యా సంస్థలద్వారా ప్రజలందరూ యీ విలువలను గుర్తించే విధంగా చేయడం దేశానికి నైతికంగా విలువ యేమీ ఉండదు. నైతిక ప్రయోజనాల నిమిత్తం అధికారం వినియోగించాలనే విషయాన్ని మన స్వాతంత్ర్య ఉద్యమ నాయకుల ద్వారా లభించిన అమూల్యమైన వారసత్వం.చరిత్ర గుణపాఠాలు మన జాతీయత మనకు నేర్పాయి.

జాతీయ లక్ష్యం:

ఇతరులపై పెత్తనం చేసే సామ్రాజ్య విస్తరణ కాంక్షను మన జాతీయ లక్ష్యం వ్యక్తం చేయడంలేదని నేను గాఢంగా భావిస్తున్నాను. మనం సామ్రాజ్య వాదుల పాదాల క్రింద నలిగి బయట పడ్డాం. ఆ భారం ఎంతటిదో మనకు తెలుసు. దారిద్ర్యం, అవిద్య. రోగపీడిత బాధలనుండి విముక్తి కలిగించి సుఖజీవనానికి అవసరమైన కనీసవసతులను కలిగించడానికి మనం కృషి చేస్తాము. అంతేగాక సంప్రదాయం పేరుతోజరిగే హానికరమైన దురాచారాలను, ఉచ్చనీచ అహంభావాలను మనం తొలగిద్దాము. సంకుచిత స్వార్థపరత్వాన్ని, కుల వర్గ తత్వాలను రూపుమాపుదాము. జాతీయ సంప్రదాయాలుగా వీటి నెవరు సమర్థించకూడదు. మన దేశప్రజల సంస్కృతిలో మిళితమై ఉన్న న్యాయం, ధర్మ మనే శాశ్వత విలువలను సంరక్షించడం మన పవిత్ర ధర్మంగా భావిస్తున్నాము. నైతిక బాధ్యతగా స్వీకరించి మనం సంతోష పూర్వకంగా వీటిని నిర్వర్తించాలి. అధికారాన్ని నీతితోను, శాస్త్ర విజ్ఞానాన్ని నైతిక సూత్రాలతోను కృషిని ఆరాధనతోను సమ్మిళితం చేయాలి. మన సంస్కృతిలోని శాశ్వత విలువలను సంరక్షించడానికీ, విలువలను తెలుసుకుని ఆత్మ పరిశుద్ధత కలిగించడానికి వీలుగా విద్యను రూపొందించి యీక్లిష్టసమస్యను నెరవేర్చాలి. అంతేగాక యీ విలువలను పవిత్రంగా అనుసరించడానికి వీలుగా మనలోని అంశాలనేగాక యితర మానవకోటిలోని సద్విషయాలను కూడ స్వీకరించినప్పుడు ఏ కాలంలోను ఎక్కడైనా యీ వివిధ రూపాలన్నిటికీ మనం వారసులముగా భావించబడుతాము.

# రాష్ట్ర ప్రణాళికా సమీక్ష

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రీ మూడవప్రణాళికా కాలంలో 27.67 లక్షల టన్నుల అదనపు ఆహారధాన్యాలు ఉత్పత్తి చేయాలని ఉద్దేశించారు. ఈ కాలంలో మొత్తం దేశంలో 200 లక్షల టన్నుల అదనపు ఉత్పత్తి జరగాలని లక్ష్యం ఈ రాష్ట్రానికి కేటాయించినలక్ష్యంమొత్తందేశఉత్పత్తిలో 13.8 శాతం ఉంటుంది. మనరాష్ట్రంలో ప్రణాళికా కాలంలో మొదటి మూడు సంవత్సరాలలో 19.3 లక్షల టన్నుల ఆహార ధాన్యాల ఉత్పత్తి జరిగింది. ప్రస్తుత సంవత్సరంలో కేటాయించబడిన 6 లక్షల టన్నుల రసాయనిక ఎరువుల సరఫరా జరిగినపక్షంలో ప్రణాళికాకాలం అంతానికి 26.92 లక్షల టన్నుల ఆహారధాన్యాల ఉత్పత్తి జరుగుతుందని ఆశించబడుతున్నది.

మూడవ ప్రణాళిక ఆరంభంలో నూనె విత్తుల ఉత్పత్తి 7.85 లక్షల టన్నులు ఉన్నది. మూడవ ప్రణాళిక కాలంలో అదనంగా 4 లక్షల టన్నుల నూనెవిత్తులు ఉత్పత్తి చేయాలని ఉద్దేశించారు. 1961_65 సంవత్సరం ఆఖరువరకు 2.97 లక్షల టన్నుల నూనెవిత్తుల ఉత్పత్తి జరిగింది. 1965_66 సంవత్సరంలో 1.03 లక్షల టన్నుల ఉత్పత్తి జరుగుతుందని ఆశించబడుతున్నది. ఈ విధంగా మూడవ ప్రణాళికలో ఉద్దేశించబడిన 4.00 లక్షల టన్నుల ఉత్పత్తి సాధించబడుతున్నది 1961_62 సంవత్సరంలో 6.29 లక్షల టన్నులు; 1962_63లో 7.66లక్షల టన్నులు; 1963_64లో 8.'1 లక్షల టన్నులు; 1964_65లో 9.51 లక్షల టన్నుల నూనెవిత్తుల నికర ఉత్పత్తి జరిగింది 1966_67లో 0.80 లక్షల టన్నుల ఉత్పత్తి జరగాలని ఉద్దేశించారు.

రెండవప్రణాళిక ఆఖరువరకు 8 లక్షల టన్నుల బెల్లంఉత్పత్తి జరిగింది మూడవ ప్రణాళికా కాలంలో అదనంగా 1.18 లక్షల టన్నుల బెల్లం ఉత్పత్తిచేయాలని ఉద్దేశించగా 1.76 లక్షల టన్నుల ఉత్పత్తి జరుగుతుందని ఆశించబడుతున్నది. 1961_62 సంవత్సరంలో 7.77 లక్షలు; 1962_63లో 8.07 లక్షలు; 1963_64లో 10.61 లక్షలు; 1964_65లో 11.46 లక్షలటన్నుల బెల్లం ఉత్పత్తి చేయబడింది.

రెండవ ప్రణాళిక ఆఖరుకు 1.15 లక్షల బేళ్ళ ప్రత్తిఉత్పత్తి జరిగింది. మూడవ ప్రణాళికా కాలంలో అదనంగా 0.85 లక్షల బేళ్ళ ప్రత్తిఉత్పత్తి చేయాలని ఉద్దేశించారు. ఈ కాలంలో 1.05 లక్షల బేళ్ళ ఉత్పత్తి సాధించారు 1963_64లో 1.34 లక్షల బేళ్ళు; 1964_65లో 1.40 లక్షల బేళ్ళ ప్రత్తిఉత్పత్తి జరిగింది. 1966_67లో అదనంగా 0.17 లక్ష బేళ్ళు ఉత్పత్తి చేయాలని ఉద్దేశించారు.

రెండవ ప్రణాళిక ఆఖరువరకు 11.11 లక్షలటన్నుల పుగాకు ఉత్పత్తి జరిగింది. 1963_64 సంవత్సరంలో యిది 1.73 లక్షలకు పెరిగింది. 1964_65లో కూడ ఇదే స్థాయిన ఉత్పత్తి కొనసాగింది.

మూడవ ప్రణాళికా కాలంలో అదనంగా 11.91 లక్షల ఎకరాల భూమిని చిన్నతరహా నీటివనరులద్వారా సేద్యయోగ్యం చేయాలని ఉద్దేశించబడగా దిగువ తెల్పిన విధంగా 11.73 లక్షల ఎకరాలభూమిని సాగులోకి తెచ్చారు.

('000 ఎకరాలు)

| సంవత్సరం | వ్యవసాయ రంగం | సి. డి. రంగం | మొత్తం |
|---|---|---|---|
| 1961_62 (నికరం) | 102.61 | 32.92 | 135.53 |
| 1962_63 ( '' ) | 154.30 | 29.77 | 184.07 |
| 1963_64 ( '' ) | 252.50 | 51.20 | 303.70 |
| 1964_65 ( '' ) | 214.24 | 66.74 | 280.98 |
| 1965_66 (అంచనా) | 208.50 | 60.00 | 268.50 |
| మొత్తం | 932.15 | 240.63 | 1,172.78 |

ఆహార ధాన్యాల ఉత్పత్తుల చెప్పుకోదగిన మొత్తంలో అధికం చేయడానికి వీలుగా ఆయిల్ ఇంజనులు, పంపుసెట్లు, విద్యుచ్ఛక్తి మోటార్లు సరఫరా చేయడమే వ్యవసాయరంగంలో అమలు జరిపే ముఖ్య పథకాల ఉద్దేశం.

మూడవ ప్రణాళిక క్రింద నాలుగు సంవత్సరాలలో (1961_65) ప్రతి సంవత్సరం దిగువ విధంగా యివి సరఫరా చేశారు :_

| సంవత్సరం | ఆయిల్ ఇంజన్లు సంఖ్య | విద్యుచ్ఛక్తి మోటార్లు సంఖ్య |
|---|---|---|
| 1961_62 | 131 | 135 |
| 1962_63 | 565 | 503 |
| 1963_64 | 740 | 559 |
| 1964_65 | 2 819 | 2,185 |
| మొత్తం | 4.255 | 3 382 |

ఈ పద్దు క్రింద 1965_66 లో రు. 125 లక్షలు, 1966_67 లో రు. 70.20 లక్షలు కేటాయించారు. 1965_66; 1966_67 సంవత్సరాలలో దిగువ విధంగా కేటాయించారు.

| సంవత్సరం | ఆయిల్ ఇంజన్లు | విద్యుచ్ఛక్తి మోటార్లు |
|---|---|---|
| 1965_66 | 1,000 | 6 334 |
| 1966_67 | 550 | 3,763 |

మూడవ ప్రణాళికా కాలంలో 2 56 లక్షల ఎకరాల వ్యవసాయ భూములలో భూసార పరిరక్షణ చర్యలు తీసుకోవాలని ఉద్దేశించబడగా 1 98 లక్షల ఎకరాలలో భూసార పరిరక్షణ సాధించబడనున్నదని ఆశిస్తున్నారు. మూడవ ప్రణాళికా కాలంలో నదీలోయ ప్రాజెక్టుల ఆరగాణీ ప్రాంతాల లోని 11.29 వేల ఎకరాలలో భూసార పరిరక్షణచర్యలు తీసుకోవాలని ఉద్దేశించారు. అయితే 9.85 లక్షల ఎకరాలలో నిసర చర్యలు తీసుకోబడిందని అంచనా.

మూడవ ప్రణాళికా కాలంలో పశుపోషణ కార్యక్రమాలను తీవ్రతరంగా అమలు జరుపుటకు మూడవ ప్రణాళిక కాలంలో 4 కీలకగ్రామ కేంద్రాలను చేర్చారు. వయస్సు చెల్లిన ఆవులు గేదెలను అధిక సంఖ్యలో పోషించడానికి మరో 4 కేంద్రాల కార్యక్రమాలను విస్తరింపజేస్తున్నారు. ధోన్ ప్రాంతంలో క్రొత్తగా రెండు కీలక గ్రామ కేంద్రాలను ప్రారంభించారు. దీనికి అనుబంధంగా 10 ఉప కేంద్రాలు ఉన్నాయి. 6 కేంద్రీకృత రేతస్సేకరణ కేంద్రాలు కూడ ఉన్నాయి. పశుగణాభివృద్ధి పథకాల క్రింద రెండవ ప్రణాళికలో ప్రారంభించ బడిన 4 క్షేత్రాలను మూడవ ప్రణాళిక కాలంలో ఆదనంగా పరికరాలు, భవనాలు సరఫరా చేయడంద్వారా పటిష్ఠం చేయబడి నాయి. దీనికితోడు కొన్ని క్షేత్రాలను పునర్వ్యవస్థీకరించారు. మూడవ ప్రణాళికా కాలంలో ఒకపశుపోషణ క్షేత్రాన్ని ప్రారంభించారు. స్థానిక పశుజాతిని అభివృద్ధి పరచడానికి వీలుగా ఆసక్తిగల రైతులకు 50 శాతం విరాళంపై మేలుజాతి ఆబోతులను సరఫరాచేశారు. ప్రస్తుతం ఉన్న గొఱ్ఱెలపెంపకం క్షేత్రాన్ని పటిష్ఠం చేయడంతోపాటు మరొక గొఱ్ఱెలపెంపకం కేంద్రాన్ని నెలకొల్పారు. క్రొత్తగా మూడు గొఱ్ఱెల ఉన్ని విస్తరణ కేంద్రాలను నెలకొల్పారు. ఎంపికచేసిన కొన్ని క్షేత్రాలలో తీవ్రతర మాంసం ఉత్పత్తి కార్యక్రమాలను చేపట్టారు.

మూడవ ప్రణాళికా కాలంలో 10 కోళ్ళ విస్తరణ కేంద్రాలకు అదనపు భవనాలను ఏర్పాటుచేశారు. 5 విస్తరణ కోళ్ళకేంద్రాలను జిల్లా కోళ్ళక్షేత్రాలుగా మార్చడం జరిగింది. 2 జిల్లా కోళ్ళక్షేత్రాలను పటిష్ఠం చేశారు. 2 తీవ్రతర కోళ్ళ అభివృద్ధి బ్లాకులను ప్రారంభించారు. మూడు కోళ్ళ ఉత్పత్తి మార్కెటింగ్ కేంద్రాలతో సహా ఐదుప్రదేశాలలో గ్రుడ్ల తీవ్రతరం ఉత్పత్తి కార్యక్రమాన్ని చేపట్టి, ఆ విధంగా రాష్ట్రమంతటికి వర్తింపజేశారు. రెండుప్రాంతీయ కోళ్ళ పెంపకం క్షేత్రాలను పునర్వ్యవస్థీకరించడంతోపాటు ఒకబాతుల విస్తరణ కేంద్రాన్ని కూడ నెలకొల్పారు

సమీకృత పాలసరఫరా పథకం బృహత్తరమైనది ఈ పథక క్రింద హైదరాబాదులో ప్రధాన పాలక్షేత్రం భవనాల నిర్మాణం, విజయవాడలో పాలఉత్పత్తి ఫ్యాక్టరీ నిర్మాణం పురోభివృద్ధి దశలో ఉన్నాయి. హైదరాబాదులో పాయిలెట్ పాల సరఫరా పథకం అమలులో ఉన్నది. కృష్ణాజిల్లా పామర్రులో శీతల కేంద్రం అన్ని హంగులతో నిర్వహింపబడుతున్నది. ఆంధ్రప్రాంతంలోని హనుమాన్ జంక్షన్ లో ఒకశీతల కేంద్రం; తెలంగాణా ప్రాంతంలోని కడ్తాల్ లో ఒకశీతల కేంద్రం ఉత్పత్తులను ప్రారంభించాయి. తెలంగాణా ప్రాంతలో షాద్ నగర్ లో ఒక శీతల కేంద్రాన్నికూడ ప్రారంభించారు పాయిలెట్ పాలసరఫరా పథకంక్రింద హైదరాబాదులోను. పాలసరఫరా పథకం క్రింద విజయవాడలోను ప్రతిరోజు 2 000 లీటర్ల పాలను ప్యాశ్చరైజ్ చేసి హైదరాబాదు. విజయవాడ వినియోగదార్లకు సరఫరా చేస్తున్నారు. 1966_67 లో సగటున ప్రతిరోజు 40000 లీటర్ల పాలను ఉత్పత్తి చేయాలని ప్రతిపాదించారు. హైదరాబాదులోని ప్రధాన పాలక్షేత్రం వచ్చే సంవత్సరం నుండి ఉత్పత్తి ప్రారంభిస్తుంది.

మూడవ ప్రణాళికలో అడవుల అభివృద్ధి పద్దుక్రింద రు. 131.61 లక్షలు కేటాయిస్తారని ఆశించబడుతున్నది. రాజమండ్రిలో కలపకోత _ సీజనింగ్, పరిరక్షణ ప్లాంటును నెలకొల్పారు. 1964 నవంబరు నుండి సమీకృత యూనిట్ పనిచేస్తున్నది. 17,836 ఎకరాలలో టేకు, 2341 ఎకరాలలో యూకలిప్టస్, 560 ఎకరాలలో అగ్గిపుల్లలకలప; 3410 ఎకరాలలో చవుకుమాను; 578 ఎకరాలలో రక్తచందనమొక్కలు నాటడం చేపట్టారు. రెండవ ప్రణాళికలో ప్రారంభించబడిన నెహ్రూ జూలాజికల్ పార్కు 1963 అక్టోబరునుండి ప్రజల సందర్శనకు అనుమతించబడింది. 1966_67 వార్షిక ప్రణాళికలో అడవుల అభివృద్ధికి రు 32 లక్షలు కేటాయించారు

భూసార సంరక్షణ పథకాలక్రింద అటవీ ప్రాంతాలలో 16559 ఎకరాలలో వివిధ రకాలైన మొక్కలను పెంచారు. 11681 ఎకరాలలో త్వరితగతిన పెరిగే మొక్కలను నాటారు తూర్పుగోదావరీ, విశాఖపట్నం జిల్లాలలోని ఏజన్సీ ప్రాంతాలలో కాఫీమొక్కలు పెంచే పథకాన్ని కూడ చేపట్టారు. 1966_67 లో కూడ యివే

పథకాలను అమలు చేస్తారు. ఇందుకై నాల్గవ ప్రణాళికలో రు. 10 లక్షలు కేటాయిస్తున్నారు.

నీటి పారుదల ప్రాజెక్టుల క్రింద ఉన్న ఆయకట్టు భూములను అభివృద్ధి పరచడానికి మూడవ ప్రణాళికలో ప్రత్యేక నిధులను కేటాయించలేదు. సంబంధిత శాఖలు తమ అవసరాల మేరకు తగిన నిధులను సరఫరా చేయాలని నిర్దేశించారు. ప్రణాళికలో తగినన్ని నిధులు కేటాయించబడని ఫలితంగా అనేక శాఖలు చెప్పుకోదగిన మొత్తాలను యీ పథకాలకై కేటాయించలేకపోయాయి. నీటి పారుదల వసతులను వినియోగించడంలోగల ప్రాముఖ్యత దృష్ట్యా ప్రత్యేక కేటాయింపును చేయాల్సిన అవసరం ఏర్పడింది. తదనుగుణంగా 1963లో ప్రణాళికను రు. 31[illegible].66 కోట్లకు సవరించినప్పుడు యీ పథకాలకై రు. 2.08 కోట్లు కేటాయించారు. భూముల స్వాధీనంలో చట్టరీత్యా ఏర్పడిన చిక్కుల వల్ల, యంత్ర సామగ్రి కొనుగోలుకు విదేశమారకం క్లిష్టతల ఫలితంగా 1964-65లో రు 18.71 లక్షలు మాత్రమే ఖర్చు చేశారు అయితే 1965-66లో పని చురుకుగా సాగింది.

రైతులు స్వయంగా తమ ఆయకట్టు భూములను అభివృద్ధి చేసుకోవడానికి ఋణ సౌకర్యాలు కల్పించడానికి ఆంధ్రప్రదేశ్ కేంద్ర సహకార భూమి తనఖా బ్యాంకు డిబెంచర్లలో రాష్ట్రం తరపున 1965-66లో రు. 25 లక్షలు కేటాయించారు. దీనికితోడు నాగార్జునసాగర్ ప్రాజెక్టు ప్రాంతంలో వివిధ పథకాలను చేపట్టడానికి రు. 108.14 లక్షలు కేటాయించారు. టి. బి. పి. హైలెవల్ కెనాల్, కె.సి. కెనాల్, కడెం ప్రాజెక్టు ప్రాంతాలు ఇతర నీటి పారుదల ప్రాజెక్టు ప్రాంతాలలో ఆయకట్టు అభివృద్ధి నిమిత్తం 1965-66లో రు. 44.50 లక్షలు కేటాయించారు.

మూడవ ప్రణాళిక ఆఖరువరకు మొత్తం 16,066 ప్రాథమిక సహకార వ్యవసాయ పరపతి సంఘాలు పనిచేస్తున్నాయి. ఇందులో 30 లక్షల మంది సభ్యులు ఉన్నారు. 24375 గ్రామాలకు 160 లక్షల మంది గ్రామీణప్రజలకు యిది వర్తిస్తుంది.

మూడవ ప్రణాళికా కాలంలో స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణాలక్రింద రు 46 కోట్లు ఇవ్వాలని అంచనా. 1961-62లో రు 18.86 కోట్లు మాత్రమే పంపిణీ చేశారు. 1962-63 లో రు 18.74 కోట్లు; 1963-64లో రు 21.64 కోట్లు. 1964-65 లో 18.67కోట్లు పంపిణీ చేశారు. ఋణాలు పంపిణీ చేయడంలో యింతవరకు అభివృద్ధి సాధించబడలేదు. ఋణాలను మంజూరు చేయడంలో అనుసరించాల్సిన నిబంధనలు క్లిష్టంగా ఉన్న కారణంగాను సహకార కేంద్ర బ్యాంకులలో ఎక్కువ బకాయీలు ఉన్న కారణంగాను పంపిణీలో అభివృద్ధి సాధించబడలేదు. 1965-66లో రు 30కోట్లు; 1966-67లో రు 33 కోట్లు పంపిణీ చేయాలని నిర్దేశించారు. పరిస్థితిని మెరుగుపరచడానికి అవసరమైన చర్యలను తీసుకుంటున్నారు.

174 ప్రాథమిక భూమి తనఖా బ్యాంకుల ద్వారా దీర్ఘకాలిక పరపతి సౌకర్యాలు కల్పించడానికి ఆంధ్రప్రదేశ్ సహకార కేంద్ర భూమి తనఖా బ్యాంకు ప్రయత్నిస్తున్నది. ఈ బ్యాంకులద్వారా 1960-61లో రు 1.83 కోట్లు, 1961-62లో రు 3.34 కోట్లు; 1962-63లో రు 3.23కోట్లు; 1963-64లో రు 3.62కోట్లు, 1964-65లో రు4.47 కోట్లు దీర్ఘకాలిక ఋణాలుగా పంపిణీ చేశారు. 1965-66లో రు 6.00 కోట్లు 1966-67లో రు 9.00 కోట్లు సరఫరా చేయాలని అంచనా వేశారు.

మూడవ ప్రణాళికా కాలంలో 25 ప్రాథమిక మార్కెటింగ్ సంఘాలను ఏర్పాటు చేయాలని ఉద్దేశించారు. అయితే 12 సంఘాలను నెలకొల్పడం జరిగింది. 1966-67లో అదనంగా 3 సంఘాలను నెలకొల్పడానికి ఉద్దేశించారు. గ్రామీణ గోదాముల పథకంక్రింద మూడవ ప్రణాళికలో 300 గ్రామీణ గోదాములను నిర్మించాలని ప్రతిపాదించారు.

## నీటి పారుదల:

నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణం పని షెడ్యూలు ప్రకారం కొనసాగుతున్నది. రెండవ ప్రణాళిక ఆఖరువరకు దీనిపై రు 39.17 కోట్లు ఖర్చుచేశారు. మూడవ ప్రణాళికలో రు 65.00 కోట్లు ఖర్చు పెట్టాలని ఉద్దేశించారు. మరుసటి సంవత్సరం ప్రణాళికలో రు 8.20 కోట్లు కేటాయించారు. దీనివల్ల స్పిల్ వేలెవెల్ (+) 495 అడుగుల వరకు డాం నిర్మాణం పూర్తి కాగలుగుతుంది. ఈ విధంగా 1966 జూన్ వరకు 5.79 లక్షల ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం లభిస్తుంది.

భారీ మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టుల పథకం క్రింద మూడవ ప్రణాళికలో 4.08 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం కల్పించబడుతుంది. ఈ విధంగా యీ ప్రాజెక్టు ద్వారా మొత్తం 9.99 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం లభిస్తుంది. ఈ ప్రణాళిక కాలంలో కల్పించబడిన నీటి పారుదల వసతులలో 4.06 లక్షలకు నీటిని వినియోగించారు. మొత్తం 8.30 లక్షల ఎకరాలకు యీ సౌకర్యాన్ని వినియోగించుకున్నారు.

## విద్యుచ్ఛక్తి:

రెండవ ప్రణాళిక ఆఖరు వరకు రాష్ట్రంలో 213 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి జరిగింది. తుంగభద్రా జల విద్యుచ్ఛక్తి పథకం (28.8 మెగావాట్లు), తుంగభద్రా హెడ్ థర్మల్ పథకం (30.0 మెగావాట్లు; హైదరాబాదులోని గ్యాస్టర్బో సెట్లు (20.0 మెగావాట్లు) 1964-65 లో అదనంగా 78.80 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి జరిగింది. ఎగువ సీలేరు జలవిద్యుచ్ఛక్తి పథకం,

కొత్తగూడెం థర్మల్ పథకం ప్రథమ దశలో 1965-66 లో ఒక్కొక్కటి 60.0 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయాలని మొదట ఉద్దేశించారు. అయితే భారత-పాక్ యుద్ధం సందర్భంలో "బాగె-కరాచీ" నౌకలో తెస్తున్న యంత్ర పరికరాలను కరాచీలో అధర్మంగా ఆపుచేసిన ఫలితంగా ఎగువ సీలేరు ప్రాజెక్టు పనికి అంతరాయం ఏర్పడింది. కొత్తగూడెం మొదటి దశలో ఒక సెట్ నుండి 60.0 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని 1966 మార్చినుండి ప్రారంభిస్తారు. 1966 మే నుండి కమర్షల్ వినియోగానికి ఉపయోగిస్తారు. మూడు నెలల తర్వాత రెండవ సెట్టు పని ప్రారంభిస్తుంది. కొత్తగూడెం రెండవ దశలో 1966 నవంబరు నుండి ఒక సెట్టు ఉత్పత్తి ప్రారంభిస్తుంది. దీని వల్ల 60 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి జరుగుతుంది. రెండవ యూనిటు 1967 మార్చినుండి పని ప్రారంభిస్తుంది. దీని వల్ల 60 మెగావాట్ల విద్యుచ్ఛక్తికి ఉత్పత్తి జరుగుతుంది. ఈ విధంగా 1966-67 లో అదనంగా 2-40 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి జరుగుతుంది.

మూడవ ప్రణాళికలో శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణానికై దాదాపు రు 11.00 కోట్లు ఖర్చుచేస్తారని ఆశించబడుతున్నది. మరుసటి సంవత్సరానికై రు. 4 50 కోట్లు కేటాయించారు. దీనివల్ల శాశ్వత కాఫర్ డాములు, నదీగర్భం మధ్య 80 అడుగుల లోతైన రంధ్రాల నిర్మాణం పూర్తి అవుతుంది. నాలుగవ ప్రణాళికా పథకం క్రింద అడ్వాన్సు పనిగా దిగువ సీలేరు ప్రాజెక్టు నిర్మాణం పని చేపట్టబడింది. దీనికై యీ సంవత్సరం రు. 1 కోటి కేటాయించారు. (ఈ ప్రభుత్వం రు. 25 లక్షలు మంజూరు చేసింది.) 1966-67 సంవత్సరంలో రు. 3 కోట్లు కేటాయించడంవల్ల నిర్మాణం పని యిదే స్థాయిలో చురుకుగా కొనసాగే అవకాశం ఉన్నది.

గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసే పథకం క్రింద 1961-65 నాలుగు సంవత్సరాలలో 2135 పట్టణాలు, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు. 1965-66 లో పట్టణాలకు గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడలేదు యీ సంవత్సరం భారత ప్రభుత్వం రు 50 లక్షలు ఋణ సహాయంగా మంజూరు చేసింది వ్యవసాయ అవసరాలకై బావికి రు 400/- ల చొప్పున 12500 బావులకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడానికి యీ మొత్తాన్ని వినియోగిస్తారు.

పరిశ్రమలు:

1963 సంవత్సరపు పరిశ్రమల వార్షిక పరిశీలన నివేదిక ప్రకారం కేంద్ర రంగంలో మొత్తం ఉత్పత్తితో పోల్చినప్పుడు రాష్ట్ర ఉత్పత్తి 3.50 శాతం ఉండాలని లక్ష్యం ఏర్పరచగా, నికరంగా తేలిన ఉత్పత్తి శాతం 2.86 మాత్రమే. అయితే రాష్ట్రంలోని సాధన సంపత్తుల్ని లెక్కకు తీసుకుని, ఆ లెక్కన రాష్ట్రాల ఉత్పత్తి విలువలను నిర్ణయించి చూసినప్పుడు యీ శాతం తక్కువే అయినప్పటికీ, 1959 నాటి వార్షిక పరిశీలన నివేదికనూ, 1963 నాటి నివేదికనూ సమీక్షించి చూసినప్పుడు మాత్రం కాస్తంత అభివృద్ధి గోచరించక మానదు.

రాష్ట్రంలో పరిశ్రమలను అభివృద్ధి పరచే ఉద్దేశంతో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అంతంలో ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్‌ను ఒకదానిని ఏర్పాటు చేయడం జరిగింది. పరిశ్రమలకు ఆర్థిక సహాయాన్ని కల్పించడం, కొన్ని కీలక పరిశ్రమలకు ప్రత్యేకంగా సహాయపడడం దీని లక్ష్యాలు. తృతీయ ప్రణాళికలో రాష్ట్రం తన వాటాధనంగా రూ. 189 లక్షలను యీ కార్పొరేషనుకు అందజేయగా ఇందులో రూ. 100 లక్షల్ని ఒక్క 1965-66 లోనే అందచేయడం జరిగింది. రాష్ట్రంలో కేంద్రరంగంక్రింద ఏర్పాటు చేయబడే పరిశ్రమలకు కొన్ని కొన్ని ప్రాథమిక సౌకర్యాలను కల్పించేందుకు రాష్ట్రప్రణాళికలో కొంత మొత్తం కేటాయించబడింది. ఈ సౌకర్యాల నిమిత్తం తృతీయ ప్రణాళిక మొత్తం కాలంలో భారీ విద్యుత్పరికరాల కర్మాగారం నిమిత్తం రూ. 39.92 లక్షల్నీ, సింథటిక్ మందుల కర్మాగారం నిమిత్తం రూ. 46.77 లక్షల్నీ వెచ్చించడం జరిగింది.

పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్ కార్యక్రమాలేగాక కొన్ని పారిశ్రామిక ప్రాంతాలలో అభివృద్ధికిగాను వివిధ సౌకర్యాలను కల్పించేందుకు వీలయిన ఒక పథకాన్ని కూడా చేపట్టడం జరిగింది. దీని క్రింద రాష్ట్రంలో హైదరాబాదు చుట్టుపట్ల నాలుగు పారిశ్రామిక ప్రాంతాలు, విశాఖపట్టణంలో ఒకటి అభివృద్ధి పరచబడ్డాయి.

గ్రామీణ పరిశ్రమలు, కుటీర పరిశ్రమల క్రింద తృతీయ ప్రణాళికలో రూ. 8.90 కోట్లు వెచ్చించాలని భావించబడినది. దీనిలో చేనేత పరిశ్రమ అభివృద్ధికి వినియోగించే రూ. 3.62 కోట్లు కూడా కలిసి వుంది ఆంధ్ర ప్రదేశ్ లఘు పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషనుకు 1964-65 సంవత్సరాంతానికి రూ. 25 లక్షలు ఇవ్వడం జరిగింది. 1965-66 లో రూ 17 లక్షలు యిందు నిమిత్తం కేటాయించబడ్డాయి పరిశ్రమలకు రాష్ట్ర సహాయానికి అవకాశాన్ని కల్పించే చట్టం క్రింద ఋణాలను పంపిణీ చేసే నిమిత్తం తృతీయ ప్రణాళికలో రూ. 34.65 లక్షలు కేటాయించబడ్డాయి. ఈనాడు రాష్ట్రంలో సాంప్రదాయక పారిశ్రామిక వాడలు పద్దెనిమిది రాష్ట్ర సహాయంపొందే ప్రయివేటు పారిశ్రామిక వాడలు పధ్నాలుగు వున్నాయి. తృతీయ ప్రణాళికలో వీటిపై రూ. 227.47 లక్షల ఖర్చు వుంటుందని అంచనా. చర్మ పరిశ్రమకు రాష్ట్రంలో అధికంగా వనరులు వున్నాయి. ఈ చర్మ పరిశ్రమ అభివృద్ధికి

తృతీయ ప్రణాళికలో రూ. 37.48 లక్షలు కేటాయించడమైనది. ఈ పద్దుక్రింద హైదరాబాదు చర్మశుద్ధి పరిశ్రమకు సంబంధించిన పైలట్ పథకం ఒకదానికి తృతీయ ప్రణాళికలో రూ. 10 లక్షలు కేటాయించబడ్డాయి

తృతీయ ప్రణాళికలో చేతిపనులకు రూ. 17.98 లక్షలు, పట్టు పరిశ్రమకు 10.21 లక్షలు, పారిశ్రామిక సహకార సంఘాలకు రూ 7.27 లక్షలు, పీచు పరిశ్రమకు రూ 4.77 లక్షలు, రాష్ట్ర ఖాదీ, గ్రామోద్యోగ మండలి రిప్రజెంటింగ్ గ్రాంట్లు రూ 8.22 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా. తృతీయ ప్రణాళికలో చేనేత పరిశ్రమకు కేటాయించిన రూ 3 65 కోట్లలోనూ రూ 2.12 కోట్ల రిబేటు పథకం క్రిందా రూ 32.30 లక్షలు సహకార నూలు మిల్లులకు రాష్ట్రం వంతుక్రింద అందజేయబడుతుంది.

1961 లో ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్ ఏర్పాటు చేయబడింది. వాటాధనం క్రింద రూ 40 లక్షలు (1961–62 లో రూ 10 లక్షలు, 1962–63 లో రూ 30 లక్షలు) యీ కార్పొరేషన్‌కు యివ్వడం జరిగింది. వచ్చే ఏడాది ప్రణాళికలో యిందుకుగాను రూ 10 లక్షలు కేటాయించడమైనది. రాష్ట్రంలో తృతీయ ప్రణాళికలో మొత్తం ఖనిజోత్పత్తిలో 21 శాతం ఇనుము 13 శాతం బేరైట్, 7 శాతం చైనా మట్టి, 0.3 శాతం సున్నం ఈ కార్పొరేషన్ వెలికితీస్తున్నది.

రోడ్లూ, రవాణా:

ద్వితీయ ప్రణాళికాంతానికి రాష్ట్రంలో మొత్తం రోడ్ల నిడివి 12,3[illegible]0 మైళ్లు. అంటే 1291 మైళ్ళ నిడివిగల జాతీయ రహదార్లు, 2403 మైళ్లు రాష్ట్ర రోడ్లు, 8230 మైళ్ళు జిల్లాల్లో పెద్ద రోడ్లు, మరొక 316 మైళ్ళు జిల్లాల్లోని యితర రోడ్లు వున్నాయన్నమాట. వీటిలో 283 మైళ్ళు సిమెంటు రోడ్లు, 5780 మైళ్లు తారురోడ్లు, 5514 మైళ్లు కంకరరోడ్లు, 763 మైళ్ళు మట్టి రోడ్లువున్నాయి. తృతీయ ప్రణాళికలో 270 మైళ్లు నిడివి రోడ్లు కొత్తవి వెయ్యాలనీ, 233 మైళ్ళు కంకర పరచాలనీ 506 మైళ్లు తారు రోడ్లుగా మార్చాలనీ 67 మైళ్ళు సిమ్మెంటు చెయ్యాలనీ 494. రాతిపనులు చేట్టాలని అంచనా.

తృతీయ ప్రణాళికలో జిల్లాపరిషత్తు రోడ్లలో 600 మైళ్ళు పక్కా రోడ్లు, 1800 మైళ్లు కచ్చారోడ్లు వుంటాయి. తృతీయ ప్రణాళికలో రోడ్డురవాణా సంస్థకు రాష్ట్ర వాటాగా రూ 3కోట్లు యివ్వడం జరిగింది. 1966–67లో వార్షిక ప్రణాళికలను రోడ్డు రవాణా సంస్థకొరకు కేటాయించినది. రూ 160 లక్షలు. ఇందులో యీ కార్పొరేషనుకు స్వీయవనరులు రూ 1కోటివరకు వుంటాయి

విద్య:

సాధారణ విద్య క్రింద పునర్వ్యవస్థీకరించుకున్న లక్ష్యాలకొరకు అదనంగా విద్యార్థుల్ని చేర్చే విషయంలో ఒక్క మధ్యగ్రూపు విద్యార్థులలో తప్ప మిగతా గ్రూపులన్నిటిలోనూ మెరుగుదల కనిపించింది. ప్రాథమిక విద్యగ్రూపులో తృతీయ ప్రణాళికలో 7.75 లక్షల మేరకు ఎన్‌రోల్ చెయ్యాలన్న మన లక్ష్యం నెరవేరింది. మధ్య గ్రూపువారి విషయంలో మనలక్ష్యం 2.58 లక్షలు కాగా 2.45 లక్షల మందినే ఎన్‌రోల్ చెయ్యడం జరిగింది. సెకండరీ స్థాయి లక్ష్యం 77,000 కాగా 91 000 మందిని ఎన్‌రోల్ చెయ్యడం జరిగింది, విశ్వవిద్యాలయ స్థాయిలో 17,000 మందిని ఎన్‌రోల్ చెయ్యాలన్న మనలక్ష్యం పూర్తిగా నెరవేరిందనే చెప్పవచ్చు.

సాంకేతిక విద్యక్రింద ఇప్పుడు 7 ఇంజనీరింగు కళాశాలలు 22 పాలిటెక్నిక్‌లు వున్నాయి. ఇంజనీరింగు కళాశాలలలో ద్వితీయ ప్రణాళికాంతానికి వున్న సీట్లసంఖ్యను 1075 నుండి 1755కు పెంచడము జరిగింది. అదేవిధంగా పాలిటెక్నిక్‌లలో ద్వితీయ ప్రణాళికాంతాని 2433సీట్లు వుండగా, తృతీయ ప్రణాళికలో 3463కు పెంచడం జరిగింది.

ఆరోగ్యం:

వివిధ శిక్షణ కార్యక్రమాలలో ఏర్పరచుకున్న లక్ష్యాలు సాధించబడ్డాయి. అయితే అదనపు పడకలను ఏర్పాటు చేసే విషయంలో తృతీయ ప్రణాళికలో మనలక్ష్యం 6563 కాగా 2933 సంఖ్యను మాత్రమే సాధించగలిగాం ఇందుకు ప్రధానమైన కారణం దీనికి కావలసినంతగా కేటాయింపు జరగక పోవడమే. వచ్చే ఏడాది 925 అదనపు పడకల్ని ఏర్పాటు చేయాలన్నది మన లక్ష్యం. తృతీయ ప్రణాళికలో 164 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ప్రారంభించాలన్నది మన ధ్యేయం కాగా, యిప్పటికి 145 కేంద్రాలను ఏర్పాటు చేయడము జరిగింది. వచ్చే ఏడాది మరొక 22 కేంద్రాలు ప్రారంభించబడతాయి. తృతీయ ప్రణాళికలో వైద్యకళాశాలలో అదనంగా 240 సీట్లను పెంచడం జరిగింది. నిజానికి మనలక్ష్యం 25 సీట్లు మాత్రమే. ఇందుకుగాను కేంద్రప్రభుత్వం ప్రారంభించే పథకాల క్రింద భారత ప్రభుత్వం వద్దనుండి అదనపు వనరులు కల్పించబడుతున్నాయి తృతీయ ప్రణాళికలో 136 గ్రామీణకుటుంబ నియంత్రణ కేంద్రాలు, 14 పట్టణ కుటుంబ నియంత్రణ కేంద్రాలు ప్రారంభించబడ్డాయి. జాతీయ మలేరియా నిర్మూలన కార్యక్రమం క్రింద 33 5 యూనిట్లు రాష్ట్రంలో పనిచేస్తున్నాయి తృతీయ ప్రణాళికాంతానికి మశూచి నిర్మూలన కార్యక్రమం 70 శాతం జనాభాను మాత్రమే ఆవర్తింపగలదని అంచనా. నిజానికి ఈ కార్యక్రమం నూటికి నూరుపాళ్ళు జనాభాను ఆవర్తించాలన్నది మన లక్ష్యం

పట్టణ మంచినీటి సరఫరా, మురుగు కాల్వల విషయంలో తృతీయ ప్రణాళికలో చేపట్టిన 38 పథకాలలోనూ (ద్వితీయ ప్రణా

ళికలో అసంపూర్తిగా విడిచిన వాటితో సహా) 11 పథకాల్ని మాత్రమే 1966-67 ప్రణాళికాసంవత్సరంలో పూర్తిచేయాలని అసంపూర్తిగా విడిచిపెట్టడం జరిగింది. అవి తాటిపూడి రిజర్వాయరు, మంజీరా నుంచి నీటి సరఫరా పథకం, విజయవాడ డ్రయినేజి, ఏలూరు డ్రయినేజి, ఖమ్మం మంచినీటి సరఫరా సౌకర్యాల అభివృద్ధి స్టేజి I. II, హైదరాబాదు మంచి నీటి సరఫరా సౌకర్యాల విస్తరణ నరసరావుపేట మంచినీటి సరఫరా సౌకర్యాల అభివృద్ధి, వరంగల్లు మంచినీటి సరఫరా అభివృద్ధి స్టేజి II, సికింద్రాబాదు మంచి నీటి సరఫరా పథకం, ఆంధ్ర ప్రదేశ్ ప్రాంతీయ కమిటీ సిఫారసుల మేరకు చేపట్టిన తెలంగాణాలోని పట్టణ కమిటీల తాలూకు రక్షిత మంచినీటి సరఫరా పథకాలు. మంజీరా మంచినీటి సరఫరా పథకం యించుమించుగా పూర్తయినట్టే. పని చేయించి, ప్రారంభించడమే తరవాయి. ఆ తరువాత ముఖ్యంగా చెప్పుకోదగిన. పథకం తాటిపూడి రిజర్వాయరు 1961-62 లో ప్రారంభించబడింది. దీనిని వచ్చే ఏడాదికి పూర్తిచేయడం జరుగుతుంది. ప్రస్తుతం హైదరాబాదు, సికిందరాబాదు నగరాలకు సరఫరా అవుతున్న 30 ఎం. జి. డి. నీరు ఉస్మాన్ సాగర్, హిమాయత్ సాగర్‌ల నుండి లభిస్తోంది. మంజీర పథకం ప్రథమ దశ పూర్తికావడంతో యిప్పుడు అదనంగా 20 ఎం. జి డి నీరు లభించగలదు హైదరాబాదు కార్పొరేషను కాక 21 పట్టణాలకు యిప్పుడు మంచినీటి సరఫరా, శానిటరీ సౌకర్యాలు వున్నాయి. అంటే 20.4 లక్షల. జనాభాను యివి ఆవర్తిస్తున్నవన్నమాట. 1966-67 లో 2½ లక్షల జనాభాను ఆవర్తిస్తున్న మరొక రెండు పట్టణాలకు యీ సౌకర్యాలు కల్పించబడబోతున్నాయి.

## గృహ నిర్మాణం

గృహ నిర్మాణం విషయంలో తృతీయ ప్రణాళికాంతానికి 7,000 నివాస గృహాలు నిర్మాణం కానున్నాయి. ఇవి కాక 2,905 ఓపెన్ ప్లాట్లు అభివృద్ధి పరచబడతాయి. తృతీయ ప్రణాళికలో వివిధ గృహనిర్మాణ పథకాల క్రింద రూ 241 లక్షలు ఖర్చవుతుందని అంచనా. కేంద్ర ప్రభుత్వం ప్రారంభించిన మురికి వాడల నిర్మూలన పథకాల్లో కేంద్ర ప్రభుత్వం యిచ్చే వాటా డబ్బు యీ ఖర్చులో చేర్చలేదు. వచ్చే ఏడాది 17 లక్షల రూపాయిల్ని మాత్రమే వివిధ గృహ నిర్మాణ పథకాలకు కేటాయించబడింది. యింతవరకు అసంపూర్తిగా వుండిపోయిన పథకాలను పూర్తిచేయడానికే యిది వుద్దేశించబడింది.

## వెనుకబడిన తరగతుల సంక్షేమం:

షెడ్యూలు కులాలు, వెనకబడిన తరగతులవారి సంక్షేమం నిమిత్తం రూ. 1.80 కోట్లు తృతీయ ప్రణాళికలో కేటాయించబడ్డాయి. 1961-65 లో యీ నాలుగేళ్ళ లోనూ షెడ్యూలు కులాల విద్యార్థులకు రూ. 19.92 లక్షల విలువగల 10811 ప్రీ మెట్రిక్ స్టయిఫండ్‌లు, స్కాలర్ షిప్పులు మంజూరు చేయబడ్డాయి. అదనంగా 4,340 స్కాలర్‌షిప్పులను యివ్వడానికి 1965-66 లో రూ. 8.68 లక్షలు కేటాయించబడ్డాయి. 1966-67 వార్షిక ప్రణాళికలో 1,500 విద్యార్థులకు స్కాలర్ షిప్పులు యిచ్చే నిమిత్తం అదనంగా రూ. 3 లక్షలు కేటాయించబడ్డాయి.

1961-65 మధ్యకాలంలో పుస్తకాలు, స్టేషనరీ పరికరాలు కొనుక్కునేందుకుగాను 1,63 477 మంది షెడ్యూలు కులాల విద్యార్థులకు రూ. 10.16 లక్షలు ఆర్థిక సహాయం కల్పించబడింది. 1965-66 లో అదనంగా 50,000 మంది విద్యార్థులకు ఆ విధమైన సహాయం కల్పించే నిమిత్తం రూ. 2.50 లక్షలు కేటాయించబడ్డాయి.

ప్రస్తుతం రాష్ట్రంలో 150 ప్రభుత్వ వసతి గృహాలు. 989 సబ్సిడీపొందే వసతి గృహాలు వున్నాయి 24.061 మంది విద్యార్థులకు తృతీయ ప్రణాళికలో బోర్డింగు గ్రాంటు యివ్వబడతాయి. ఇందుకు రూ. 39 45 లక్షలు ఖర్చవుతుంది. 1966-67 లో అదనంగా 33 కొత్త వసతి గృహాలను ప్రారంభించాలని, మరొక 1,000 మంది విద్యార్థులకు బోర్డింగ్ గ్రాంట్లు మంజూరు చెయ్యాలని ఉద్దేశించబడింది. షెడ్యూలు కులాలవారి ఆర్థికాభివృద్ధికి యింకా అనేక పథకాలను చేపట్టడం జరిగింది. ఎద్దులు, నాగళ్ళు, బళ్ళు సరఫరా చెయ్యడం, కుటీరపరిశ్రమల నిమిత్తం, శిక్షణ-ఉత్పత్తి కేంద్రాల నిమిత్తం, మంచినీటి బావుల నిమిత్తం, కమ్యూనిటీ హాలుల నిర్మాణం నిమిత్తం ఆయా వ్యక్తులకు ఆర్థిక సహాయాన్ని అందివ్వడం, నిర్మాణాత్మకమైన కార్యకలాపాల నిమిత్తం వాలంటరీ ఏజన్సీలకు ఆర్థిక సహాయాన్ని కల్పించడం, ఇళ్ళస్థలాలను కేటాయించడం వంటివన్నీ సహాయక పథకాలలో వున్నాయి.

వెనుకబడిన తరగతుల సంక్షేమం విషయంలో తృతీయ ప్రణాళికలో యీ 21.76 లక్షల వ్యయంతో 10,855 స్కాలర్‌షిప్పులను యివ్వాలని ఉద్దేశించబడింది. 1966-67లో యీ 3 లక్షలు కేటాయింపబడ్డాయి; దీనితో 1,500 స్కాలర్‌షిప్పులు యివ్వడము జరుగుతుంది. తృతీయ ప్రణాళికలో 67,360 మంది వెనుకబడిన తరగతుల విద్యార్థులకు ఆర్థిక సహాయం కల్పించడానికి రూ 3.87 లక్షలను యివ్వడం జరిగింది. దీనితో వారు పుస్తకాలు, స్టేషనరీ పరికరాలు కొనుక్కుంటారు. 1961-62లో 2,460 మంది ప్రాథమిక సాంఘిక సంక్షేమ పాఠశాలల్లోని విద్యార్థులకు రూ0.77 లక్షల ఖర్చుతో మధ్యాహ్న భోజన సౌకర్యం కల్పించబడింది. 1962-63 నుండి విద్యాశాఖయే యునెసెఫ్ సంస్థద్వారా యీ సౌకర్యాన్ని కల్పిస్తున్నది.

షెడ్యూలు జాతుల సంక్షేమం నిమిత్తం తృతీయ ప్రణాళికలో రూ 1.78 కోట్లు కేటాయించబడ్డాయి. వీనిలో రూ 85.32

లక్షలు ఏజన్సీ ప్రాంతాలలో రవాణా, వార్తా సౌకర్యాలకు ఉద్దేశించబడ్డాయి. గిరిజనులలో విద్యావ్యాప్తికిగాను ప్రాథమిక దశలో విద్యాగ్రంథాన్ని అందించే నిమిత్తం ఆశ్రమ పాఠశాలలను ప్రారంభించి, నిర్వహించడానికి, స్కాలర్‌షిప్పులు, పుస్తకాలు, పలకలు, వస్త్రాలు మొదలయినవి అందజేయడానికి, మధ్యాహ్న భోజనాలను ఏర్పాటు చేయడానికి తృతీయ ప్రణాళికలో రూ 15.07 లక్షలు కేటాయించబడ్డాయి. లోయర్, హయ్యర్ సెకండరీ తరగతుల విద్యార్థుల నిమిత్తం హాస్టలుకూడా ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లోని ఏజన్సీ ప్రాంతంలో రూ 19.32 లక్షల వ్యయంతో 411 ఎకరాలలో కాఫీ తోటలు పెంచబడుతున్నాయి. ఆంధ్ర షెడ్యూలు జాతుల సహకార ఆర్థికాభివృద్ధి కార్పొరేషన్ కార్యకలాపాలను 1963-64లో తెలంగాణా ప్రాంతానికికూడా విస్తరింపజేయడం జరిగింది. యీ పథకం మీద తృతీయ ప్రణాళికలో రూ 22.56 లక్షలు వెచ్చించబడుతాయి. అదే పథకం 1966-67లో కూడా చేపట్టబడుతుంది. వచ్చే యేడాది ప్రణాళికలో యిందు నిమిత్తమై రూ 27 లక్షలు కేటాయించబడ్డాయి.

## సాంఘిక సంక్షేమం :

వివిధ సాంఘిక సంక్షేమ పథకాల నిమిత్తం తృతీయ ప్రణాళికలో రూ 81.46 లక్షలు కేటాయించబడ్డాయి. వీటిలో స్త్రీ, శిశు సంక్షేమానికి సంబంధించిన పథకాలకు రూ 35.42 లక్షలు ఉద్దేశించబడ్డాయి. స్త్రీ సంక్షేమం పద్దు కింద కేటాయించిన దానిలో పెద్ద మొత్తం బాల విహారాలు, క్రీచె-ప్రీబేసిక్ తరగతులు, స్త్రీల శిక్షణ కేంద్రాలకు వెచ్చించడం జరుగుతుంది. దీనికిగాను ప్రణాళికలో రూ 10 లక్షల వరకు కేటాయించబడ్డాయి. భవన నిర్మాణ కార్యక్రమాలు మాత్రం ఆత్యయిక పరిస్థితి కారణంగా వాయిదా వేయవలసివచ్చింది.

వార్ధక్యపు పింఛనులను అందజేయడం అనేది అతి ముఖ్యమైన మరొక పథకం. ఇందుకుగాను మామూలు బడ్జెటుక్రింద తగినంతగా నిధులు కేటాయించడంతోపాటు ప్రణాళికలో రూ 40 లక్షలు వెచ్చించడం జరుగుతుంది. జైళ్లలో వివిధ సంక్షేమ పథకాలను అమలుపరచడంలో అయ్యే ఖర్చులో 60 శాతం రాష్ట్ర వంతుగా రూ 5.95 లక్షలు వెచ్చించడం జరుగుతుంది. విశాఖపట్టణంలోని బోర్‌స్టలు పాఠశాలను విస్తృతపరచడంతోపాటు ఒక జూనియరు, ఒక సీనియరు సర్టిఫైడ్ పాఠశాలలను బాలుర నిమిత్తం తృతీయ ప్రణాళికలో ప్రారంభించబడ్డాయి. అంతేగాక జైళ్ళలో సంక్షేమాధికారులను ఏర్పాటు చేయడం జరిగింది. వచ్చే ఏడాదికి సాంఘిక సంక్షేమానికిగాను కేటాయించిన రూ 11 లక్షల్లోనూ రూ 7 లక్షలు స్త్రీ సంక్షేమానికి, రూ 1.15 లక్షలు జైళ్ళ సంక్షేమ పథకాలకు, రూ 1.09 లక్షలు 10 సమన్వయ సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులను కొనసాగించడానికి, రూ 1.76 లక్షలు, వికలాంగులకు షెల్టర్డ్ వర్క్‌షాపులకు, వృద్ధులు, దుర్బలులకు సంక్షేమ సేవలకు ఉద్దేశించబడ్డాయి.

## కార్మిక సంక్షేమం :

తృతీయ ప్రణాళికలో వివిధ కార్మిక సంక్షేమ పథకాలకుగాను రూ 85.61 లక్షలౌతుందని అంచనా. వృత్తిపనివారల శిక్షణపథకాలు, ఉపాధిపథకాలు ఉద్యోగుల ప్రభుత్వ భీమా పథకం-కేంద్ర ప్రభుత్వం ప్రారంభించిన యీ పథకాలలో కేంద్రం వాటా పైమొత్తంలో చేర్చబడలేదు. 1966-67 సంవత్సరపు ప్రణాళికలో యిందు నిమిత్తం రూ 26 లక్షలు కేటాయించబడ్డాయి.

తృతీయ ప్రణాళికలో 12 పారిశ్రామిక శిక్షణ సంస్థలు ప్రారంభించబడ్డాయి. ఇవిగాక ద్వితీయ ప్రణాళికాంతానికి వున్న 10 సంస్థలు తృతీయ ప్రణాళికలో కూడా నిర్వహించబడుతున్నాయి. తృతీయప్రణాళికాంతానికి రాష్ట్రంలోగల 10 సంస్థలలోనూ శిక్షణపొందే కార్మికుల సంఖ్య 3536 కాగా దానిని తృతీయ ప్రణాళికలో 4724 కు పెంచడం జరిగింది. ఇదిగాక తృతీయ ప్రణాళికలో కొత్తగా ప్రారంభించిన 12 సంస్థలలోనూ అదనంగా 2696 సీట్లు ఏర్పాటు చేయబడ్డాయి. 1966-67 లో కొత్తగా ఏ సంస్థా నెలకొల్పబడకపోయినా సీట్ల సంఖ్యమాత్రం అదనంగా 2,200 లు కల్పించబడతాయి.

ఉద్యోగుల ప్రభుత్వ భీమా పథకానికి ½ వంతు రాష్ట్ర వాటాగా రూ. 4.72 లక్షలు తృతీయ ప్రణాళికలో కేటాయించబడ్డాయి. తృతీయ ప్రణాళికాంతానికి రాష్ట్రంలో 47 ఫుల్‌టైం ఇ.ఎస్.ఐ. డిస్పెన్సరీలు, 2 పార్ట్‌టైం ఇ.ఎస్.ఐ. డిస్పెన్సరీలు, 2 ఆసుపత్రులు వుంటాయి. ఈ చికిత్సాలయాలకు 9 అంబులెన్సులను అందజేయడం జరిగింది. 1966-67 లో అదనంగా 500 గాని, ఆ పైనగాని ఇన్సూరు చేయించుకున్న వ్యక్తులుగల అన్ని ప్రాంతాలలోనూ కొత్తగా ఇ.ఎస్.ఐ. డిస్పెన్సరీలను ప్రారంభించాలని ఉద్దేశించబడింది.

ఈనాడు రాష్ట్రంలో 11 కార్మిక సంక్షేమ కేంద్రాలు వున్నాయి. వీని ద్వారా 33,000 మంది కార్మికులు లాభం పొందుతున్నారు. ఉపాధి కల్పన పథకాల క్రింద విశ్వవిద్యాలయ విద్యార్థులకు ఉపాధి కల్పన సౌకర్యాల్ని కలిగించడానికి మూడు విశ్వవిద్యాలయాలలోను మూడు వుద్యోగ సమాచార, సహాయక బ్యూరోలూ, ఇదిగాక వ్యక్తులకు తగిన వృత్తులలో ఉపాధిని కల్పించడానికిగాను ఎయిడు ఎంప్లాయిమెంట్ సర్వీసు, కౌన్సెలింగ్ యూనిట్లు, ఉద్యోగ సమాచారాన్ని సేకరించి ఉద్యోగ స్థితిగతులను మదింపు చేయడానికి యూనిట్లు లేని జిల్లాలలో మొత్తం 10

ఎంప్లాయ్‌మెంట్ మార్కెట్ సమాచార యూనిట్లూ, గ్రామీణ ప్రాంతాలలో ఉపాధి, రిజిస్ట్రేషన్ సౌకర్యాలను కల్పించడానికి వీలుగా పదకొండు ఉద్యోగ సమాచార సహాయక బ్యూరోలు, వికలాంగులకు హైదరాబాదులో ఒక ప్రత్యేక ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజి తృతీయ ప్రణాళికలో ప్రారంభించడం జరిగింది.

**పట్టణ ప్రాంతాల అభివృద్ధి:**

బజార్లు, దుకాణాలు, స్టాల్సు, కబేళాలు, చాకిరేవులు మొదలైన వాటిని నిర్మించడానికిగాను మాస్టరీ ప్లానుల తయారీకి ఈ పద్దుక్రింద పురపాలకసంఘాలకు ఋణాలు మంజూరు చేయడం జరుగుతుంది. 1961_65 వరకు యిచ్చిన ఋణాలు రూ. 26.51 లక్షలు. 1965_66 లో యిందుకుగాను కేటాయించిన మొత్తం రూ. 7.35 లక్షలు. 1966_67 కు రూ. 3 లక్షలు.

**పంచాయతీలు:**

అభివృద్ధి పనుల నిమిత్తం యీ పద్దు క్రింద పంచాయతీలకు ఋణాలు మంజూరు చేయడానికి వీలుగా పథకాలు రూపొందించబడ్డాయి. పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు ఋణాలు, గ్రాంట్లు మంజూరు చేయడం, అదనంగా క్షేత్ర సిబ్బందిని, హెడ్‌క్వార్టర్స్ సిబ్బందిని నియమించడం, పంచాయతీ కార్యదర్శులకు శిక్షణ ఇవ్వడం, సమాజ వికాసం, పంచాయతీ రాజ్యం, సహకారం విషయాలలో శిక్షణ యిచ్చే జిల్లా సంస్థలను ఏర్పాటు చేయడం, రాష్ట్ర స్థాయిలో సమ్మేళనాలను నిర్వహించడం, సాహిత్యాన్ని ప్రచురించడం, రాజేంద్ర నగర్‌ను పట్టణస్థాయికి అభివృద్ధిపరచడం_ వీటికి సంబంధించిన పథకాలను రూపొందించడం జరిగింది. పై పథకాలకు తృతీయ ప్రణాళికలో రూ 102.92 లక్షల వరకు కాగలదని అంచనా. వీటిలో రూ 25.4 లక్షలు ఋణాలను వివిధ పంచాయతీలకు 1961_65 లో పంపిణీ చేయడం జరిగింది. అదే కాలంలో రూ 9.31 లక్షలు ఋణ రూపంలోను రూ 29.91 లక్షలు గ్రాంట్ల రూపంలోనూ పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు యివ్వడం జరిగింది. రాజేంద్రనగర్‌లో ఊరు రూపొందడానికి 1961_65 లో రూ 6.15 లక్షలు వెచ్చించబడ్డాయి. వచ్చే సంవత్సరపు ప్రణాళికలో పంచాయతీసమితులకు, జిల్లాపరిషత్తులకు ఋణంగా యివ్వడానికి 2 లక్షల్నీ, గ్రాంట్లు రూపంలో మంజూరు చేయడానికి రూ 4.41 లక్షల్నీ, రాజేంద్రనగర్ అభివృద్ధికి రు 3.60 లక్షల్నీ కేటాయించడం జరిగింది.



# ఆంధ్రప్రదేశ్‌లో మత్స్య పరిశ్రమ

సామాన్యుని ఆహారంలో వుండే పోషక పదార్థాల అసమగ్రతను పూరించేందుకు చేపలు ఎంతగానో ఉపయోగపడతాయనే సత్యాన్ని ఇటీవలే అంతాగుర్తించారు. భారతదేశంలో సామాన్యుని ఆహారంలో కార్బోహైడ్రేటులు అత్యధికంగా వుండి, శరీరంలోని టిస్యూలను వృద్ధిపరిచే పోషక పదార్థాలు చాలా తక్కువగా వుంటాయనేది అందరికీ తెలిసినదే. మాంసం, కోళ్ళు, గ్రుడ్డు మొదలైనవాటిలోనూ ఎక్కువగానే శరీరపోషక పదార్థాలు వున్నప్పటికీ వీటికన్న చేపలు తేలిగ్గా జీర్ణం అవుతాయి. అందుకే చేపలను పెరిగే పిల్లలకు, దుర్బలులకు పెట్టే ఆహారంలో చేర్చమని చెప్తుంటారు. పైగా చేపలు యిప్పటికీ మార్కెట్లలో మనకు చవకగానే లభిస్తున్నాయి. పోషక పదార్థాలు అధికంగావుండి చవకగా మనకు లభించే ఆహార పదార్థాలలో ప్రధానంగా చెప్పదగ్గవి చేపలే

ఆంధ్రప్రదేశ్‌లో మత్స్య పరిశ్రమకు అపారమైన వనరులు ఉన్నాయి. అటు సముద్రతీరంలోను. యిటు నదులు. కాలువలు, చెరువులు మొదలైనవాటిలోను మత్స్యసంపద మనకు అపారంగా వుంది.

దక్షిణ భారతంలో ముఖ్యనదులుగా ప్రసిద్ధికెక్కిన గోదావరీ, కృష్ణలు ఈ రాష్ట్రంలో అటు పడమరనుంచి యిటు తూర్పుకు 400 మైళ్ళకుపైగా ప్రయాణంచేసి సముద్రంలో కలుస్తున్నాయి. కొల్లేరు, పులికాటు అనే రెండు పెద్ద సరస్సులు, అనేక భారీ. మధ్యతరహా ప్రాజెక్టులు, చెరువులు రాష్ట్రంలో వున్నాయి ఇవిగాక బంగాళాఖాతంవైపు 600 మైళ్ళ సముద్రతీరం వుంది. తీరాల్లో చేపల్ని పట్టడానికి అనువైన సముద్రప్రాంతమే 12,000 చ. మైళ్ళువుంటుంది. రాష్ట్రంలోవున్ననదులన్నీ కలిపి మొత్తం 2,600 మైళ్ళ పొడుగుంటాయి. అంతర్జలాలు 8 00,000 ఎకరాల విస్తీర్ణం, ఉప్పుకయ్యలు 2,000 చ. మైళ్ళ విస్తీర్ణం ఆవరించివున్నాయి.

ఆహార పదార్థాలలో చేపలప్రాధాన్యతను యిటీవలివరకు గుర్తించడం జరగలేదు. ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం విదేశాలనుండి దిగుమతులు ఆగిపోవడంతో మత్స్య పరిశ్రమవైపు దృష్టి కేంద్రీకరించబడింది.

యుద్ధానంతర అభివృద్ధి పథకం క్రింద మత్స్యపరిశ్రమాభివృద్ధికి తొలిప్రయత్నం జరిగింది. స్వాతంత్ర్యానంతరం, మత్స్య పరిశ్రమ అభివృద్ధికి ప్రణాళికాబద్ధమైన కార్యక్రమం అవసరం అని గుర్తింపబడింది.

దురదృష్టవశాత్తూ తొలి పంచవర్ష ప్రణాళికలో మత్స్య పరిశ్రమాభివృద్ధికి తగినంత ప్రాధాన్యత లభించలేదు. తొలి పంచవర్ష ప్రణాళికలో మత్స్యపరిశ్రమ క్రింద రాష్ట్రంలో ఖర్చుచేసినది రూ. 10.39 లక్షలు మాత్రమే. మొత్తం భారతదేశానికంతటికీ యీ పద్దుక్రింద అయిన ఖర్చు రూ. 5 కోట్లు. ఇంత కొద్దిపాటి డబ్బు వ్యయంతో వచ్చిన ఫలితాలుకూడా అంతంతమాత్రంగానే వున్నాయి. 9.9 లక్షల చేపల గ్రుడ్లను సేకరించి చెరువుల్లో వేయడం జరిగింది. టి. సి. ఎం. సహాయం క్రింద లభించిన ఇంజన్లను అయిదు పడవల్లో అమర్చడం జరిగింది. 231 టన్నుల చేపలు ఎగుమతి అయ్యాయి. 579 పౌనుల వలలకు పనికొచ్చే ప్రైవేటుదారం బెస్తలకు పంపిణీ చేయడం జరిగింది.

ప్రణాళిక కేటాయింపు:

మనకున్న వనరులను లాభసాటిగా ఉపయోగించుకోవడానికి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ప్రయత్నం జరిగింది. రాష్ట్ర ప్రణాళికలో మొదట్లో 36 పథకాలకు రూ. 110.61 లక్షలు కేటాయించబడ్డాయి. కాని యీ కేటాయింపును రూ. 70.28 లక్షలకు తగ్గించడం జరిగింది. మొత్తం దేశానికంతకూ మత్స్యపరిశ్రమ నిమిత్తం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో రూ. 11 కోట్లు కేటాయించబడ్డాయి.

రెండో పంచవర్ష ప్రణాళికలో సాధించిన విజయాల్ని యీ క్రింది విధంగా పేర్కొనవచ్చు :

హైదరాబాదులో నాలుగుటన్నుల శీతల గిడ్డంగి ఒకదానిని, విశాఖపట్టణంలో 250 టన్నుల శీతలగిడ్డంగి యూనిటుతో 20 టన్నుల ఐసుప్లాంటును ప్రారంభించడం; అదనంగా 2 లక్షల టన్నుల చేపల్ని ఉత్పత్తి చేయడానికి వీలుగా 8.47 కోట్ల చేపగ్రుడ్లను సేకరించడం; ఈశాఖకు సంబంధించిన 14 క్షేత్రాలలోను 6 133 మణుగుల చేపల్ని క్యూరుచేయడం. శిక్షణపొందిన బెస్తలకు సబ్సిడీరేట్లపై 37 మరపడవలను యివ్వడం, తొమ్మిది మత్స్య క్షేత్రాల్ని నెలకొల్పడం, ఆధునిక పద్ధతుల్లో చేపల్ని పట్టే విషయంలో 122 మంది బెస్తలకు శిక్షణ యివ్వడం, సబ్సిడీరేట్లకు 100 నైలాను వలల్నీ, 1,337 పౌనుల టెరిలీనును పంపిణీ చేయడం, మూడుబ్లాకులలో తీవ్రతర మత్స్య పరిశ్రమ అభివృద్ధి పథకాన్ని ప్రారంభించడం — ఇవి గత పంచవర్ష

తృతీయ ప్రణాళికలో రూ. 6.64 కోట్ల వ్యయమయ్యే పథకాల్ని రూపొందించి నప్పటికి రూ. 2 కోట్ల వ్యయంతో 21 పథకాలను వీలుగా పునర్వ్యవస్థీకరించడం జరిగింది. అయితే యీ కేటాయింపును యింకా తగ్గించి రూ. 1.31 కోట్లకు చేయడం జరిగింది.

తృతీయ ప్రణాళిక తొలి మూడు సంవత్సరాలలోనూ యిందు నిమిత్తమై ఖర్చు చేసిన మొత్తం రూ. 70.57 లక్షలు. అంటే తరువాతి రెండేళ్ళకు రూ. 60.65 లక్షలు వున్నదన్నమాట. అదనపు నిధుల్ని అందజేస్తే నేరుగా చేపల ఉత్పత్తిని పెంచే పథకాలను చేపట్టడానికి వీలవుతుంది.

తృతీయ ప్రణాళిక తొలి మూడేళ్ళలోనూ సాధించిన వాటిలో చెప్పుకోతగ్గవి —

100 పడవలలో యంత్రాలను అమర్చి మరపడవలుగా రూపొందించడం; అంతర్జలాలలో 182.32 లక్షల చేపల గ్రుడ్లను నిలవజేయడం; 95 సింథటిక్ వలదారాల్ని ట్వైన్‌దారాన్ని పంపిణీ చేయడం.

అదనంగా 40,000 టన్నుల చేపల్ని ఉత్పత్తి చేసే ఉద్దేశంతో 1—4—1961 నుండి 15 కోట్ల చేపగ్రుడ్లను సేకరించి వివిధ జలాలలో నిలువచేయడం జరిగింది. ఆయా పంచాయతీ సమితులు నిరహిస్తున్న చేపల క్యూరింగ్ క్షేత్రాలలో 7382 టన్నుల చేపలు క్యూరుచేయబడ్డాయి. మొదటిదశగా రాష్ట్రంలోని 30 బ్లాకులలో తీవ్రతర మత్స్యాభివృద్ధి పథకాలు ప్రవేశపెట్టబడ్డాయి. కాకినాడలో మత్స్య పరిశ్రమనిమిత్తం హార్బరు నొకదానిని నిర్మించేందుకు ప్రభుత్వం ఉద్దేశించింది.

## 6. సాధారణ మత్స్య పరిశ్రమ ప్రధాన పథకాలు :

*ప్రణాళిక పథకాలు :*

1. అంతర్జలాలలో నిలువచేయడానికై తీవ్రతర గ్రుడ్ల సేకరణ, పంపిణీ.

2. పౌష్టికాహార కార్యక్రమ విస్తరణ.

3. మత్స్యశాఖ పునర్వ్యవస్థీకరణ.

4. మత్స్య పరిశ్రమ అవసరాలు.

5. ఐస్—కం—శీతలగిడ్డంగి ప్లాంటు.

6. రాష్ట్ర తీరంలోని సముద్ర జలాల నుండి మత్స్య సంపదను వెలికితీయడానికై చేపల్ని పట్టడంలో ఆధునిక పద్ధతుల్ని తెలియజెప్పేందుకు మత్స్యపరిశ్రమ శిక్షణ కేంద్రం.

7. మేలురకం పడవలను తక్కువ ఖర్చులో నిర్మించేందుకు ప్రాంతదేశంలో కెల్ల పెద్దదైన పడవల నిర్మాణకేంద్రం.

8. మత్స్య పరిశ్రమకొరకు హార్బరును నిర్మించడానికై లెండింగ్ బెర్తింగ్ సౌకర్యాలు —

9. అధిక చేపల్ని పట్టుగోడానికి వీలుగా రిజర్వాయర్ చేపలవేట

10. బెస్తలకు శిక్షణ యివ్వడానికీ, యంత్రాలు అమర్చిన పడవలను, నైలాను వలలను సబ్సిడీరేట్లకు బెస్తలకు అందజేయడానికి ఉద్దేశించిన కోనసీమ మాస్టర్ ప్లాను.

11. బెస్త సహకార సంఘాలు.

12. మార్కెటులో వసువులు పెరుగుతున్న ధరలను అదుపులో వుంచడానికి మరింత అధికంగా చేపల్ని ఉత్పత్తి చేయడానికై ప్రత్యేక అభివృద్ధి కార్యక్రమం. (క్రేష్ ప్రోగాం)

*ప్రణాళికేతర పథకాలు :*

1. నీళ్ళున్న చెరువులలో అనుకూలమైన చేపగ్రుడ్లను వేసి, చేపలు పెరిగిన తర్వాత వాటిని సహకార సంఘాలకుగాని, పంచాయతీలకుగాని కౌలుకివ్వడానికి వీలుగా అంతర్జలాల చేపలు, చెరువుల అభివృద్ధి పథకం.

2. మధ్య దళారీలకు కౌలుకియ్యకుండా నేరుగా బెస్తలే లాభం పొందడానికి అనువుగా పెద్ద పెద్ద రిజర్వాయర్‌లలో, నదులలో చేపల్ని పట్టుకోవడానికై విడివిడిగా బెస్తలకు లైసెన్సులను మంజూరు చేసే లైసెన్సు పథకాలు.

3. వినియోగదారులకు తాజా సరుకు అందేటందుకు వీలుగా చేపల్ని పట్టిన తీరాల నుండి మార్కెటుకు వేగంగా అందజేసే శీఘ్రరవాణా సౌకర్యాలు

4 చేపలు అమ్మకం అయ్యేవరకు వాటిని నిలవచేసే ఐస్—కం—శీతల గిడ్డంగి సౌకర్యాలు.

*సముద్ర మత్స్య పరిశ్రమాభివృద్ధి :*

ఈ అంశం క్రింద మేలురకం పడవలు, తదితర పరికరాలను ప్రవేశపెట్టడం; చేపల క్యూరింగ్ క్షేత్రాల నిర్వహించడం; మత్స్య పరిశ్రమకు అవసరమైన వాటిని సంపరా చేయడం, మొదలైన కార్యక్రమాలు చేపట్టడం జరుగుతుంది.

*కాకినాడ పడవల నిర్మాణకేంద్రం :*

చేపల్నిపట్టే పడవల్లో యంత్రాలను కూర్చి మరపడవలుగా మార్చే కార్యక్రమం క్రింద మత్స్యశాఖ కాకినాడలో 7.49 ఎకరాల స్థలంలో పడవల నిర్మాణ కేంద్రాన్ని ఒకదానిని నెలకొల్పింది. భారత దేశంలో పడవల నిర్మాణకేంద్రాల్లో పెద్ద వాటిలో యిదొకటి ఇక్కడ మేలురకం పడవల్ని తక్కువ వ్యయంతో నిర్మిస్తున్నారు. అందువల్ల యితర రాష్ట్రాలకు వీటి గిరాకీ ఎక్కువగా వుంది. ఇంతవరకు 251 పడవల్ని (మరపడవల్ని) నిర్మించారు. రాష్ట్రప్రభుత్వం యీ కేంద్రాన్ని సందర్శించి యిక్కడ జరుగుతున్న కృషిని మెచ్చుకున్నది.

అటవీశాఖ, ఓడరేవుల శాఖవారి పడవలు, డింగీలు కూడా యిక్కడ తయారవుతున్నాయి. లక్కదీవులు పుదుచ్చేరి, మధ్యప్రదేశ్ కేంద్ర మత్స్య శాఖలుకూడా యిక్కడ తమకు కావలసిన పడవల్ని తయారు చేయిస్తున్నాయి.

*చేపల్ని పట్టడంలో యంత్రాల వినియోగం*

మత్స్య శాఖ అసిస్టెంట్ ఆఫీసరు ఒకరు జరిపిన పరిశీలనవల్ల బంగాళాఖాతం చేపల వేటకు అనువైనదనీ లాభసాటి అయినదనీ తేలింది. అందువల్ల యిక్కడ చేపల్ని పట్టడంలో యంత్రాలను వినియోగించాలని

ఉద్దేశించడం జరిగింది. ఈ రకమైన చేపల వేటలో అటు శిక్షణ యిటు పడవల డిజైనింగు, నిర్మాణం, బెస్తలకు పడవల పంపిణీ — వీటన్నిటిలోనూ ఆంధ్రప్రదేశ్ ఎంతో అభివృద్ధిని సాధించింది.

**అంతర్జలాలలో చేపల వేట అభివృద్ధి:**

మత్స్య శాఖ ఆధీనంలో మత్స్య పరిశ్రమ అభివృద్ధి నిమిత్తం 40,000 నిత్య జలపూరితాలైన చెరువులు వున్నాయి.

మత్స్యశాఖ యీ చెరువులలో చేప గ్రుడ్లను వేసి చేపల్ని పెంచి వాటిని కౌలుకు యిస్తుంది. తెలంగాణా ప్రాంతానికి సంబంధించినంతవరకు యిక్కడున్న 19,159 చెరువులూ మత్స్యశాఖ ఆధీనంలోనే వుండేవి. అయితే పంచాయితీలు లాభం పొందడానికి వీలుగా వీటిలో 15,902 చెరువుల్ని పంచాయితీలకు తిరిగి యిచ్చివేయడము జరిగింది. గత అయిదేళ్ళలోనూ మత్స్యశాఖకు యీ చెరువులమీద వచ్చిన ఆదాయం వివరాలు—

| | రూ. | |
|---|---|---|
| 1960–61 | 4.07 | లక్షలు |
| 1961–62 | 6.20 | ” |
| 1962–63 | 6.61 | ” |
| 1963–64 | 6.98 | ” |
| 1964–65 | 5.41 | ” |

1964-65 లో ఆదాయంలో తరుగుదలకు కారణం మత్స్యశాఖ కొన్ని చెరువులపై అధికారాలను పంచాయతీలకు యిచ్చివేయడమే

మత్స్య సంపదను పరిరక్షించే చర్యగా నదులలోనూ, కొల్లేరు, నిజాంసాగర్‌వంటి పెద్దపెద్ద సరస్సులలోను లైసెన్సు విధానం ప్రవేశపెట్టబడింది. దీని ప్రకారం జాలర్లకు చేపల్ని పట్టుకునేందుకు పర్మిట్లను మంజూరు చేస్తారు. 1964-65లో లైసెన్సు విధానం వల్ల మత్స్యశాఖకు రూ. 1.53 లక్షలు ఆదాయం వచ్చింది.

కొన్ని కొన్ని లోతునీటి ప్రాంతాలలో, ముఖ్యంగా 'సాగర్' లలో చెరువుల లోతు నీటి చేపలవేట కార్యక్రమాలు నిర్వహించబడుతున్నాయి ఇందువల్ల జాలర్లకు అధిక ఆదాయానికి అవకాశాలు ఏర్పడడమేగాక ఆధునిక పద్ధతులుకూడా తెలిసొస్తాయి. లోతు నీళ్ళలో చేపల్ని పట్టడం ద్వారా 1964-65 లో రూ. 0.51 లక్షల ఆదాయం లభించింది.

## 9 మత్స్యపరిశ్రమ ఉపకరాలు

వలల్ని అల్లుకోవడానికి నైలాను ట్వైను, తెప్పల్ని డింగీలను తయారుచేయడానికి, దుంగలు మొదలైనవాటిని జాలర్లకు సరఫరా చేయడమే యీ పథకం లక్ష్యం. 1964-65 నుండి బెస్తపనివారల కేంద్ర సహకార సంఘం ద్వారా వీరికి యీ సహాయము కల్పించబడుతున్నది.

## 10 చేపలక్యూరింగు- శీతల గిడ్డంగులు

దానాయ్‌పేట, ఎల్లాయ్‌పేట, అద్దారిపేట, కోనప్పపేట, ఉప్పాడ, పి. కె. పాలెం, బట్టిగలూరు, మంచినీలపేట, అల్లాడ, పూండి, గుప్పిడిపేట, భీమునిపట్నం, ముక్కాం, మౌంట్‌గోమరిపేట లలోని చేపలక్యూరింగ్ కేంద్రాలు పంచాయితీ సమితులకు అప్పగించబడ్డాయి. వీటి కొరకై సహాయక గ్రాంట్లుకూడా ఇవ్వడం జరిగింది.

చేపల్ని మార్కెటుకు పంపించేవరకు వాటిని కుళ్ళకుండా ఉంచేందుకై శీతల గిడ్డంగులు అవసరం. మత్స్యశాఖ విశాఖపట్నం, హైదరాబాదు నిజాంసాగర్‌లలో యిటువంటి గిడ్డంగులను ఏర్పాటుచేసింది. అంతేగాకుండా పై చోట్ల ఐసుఉత్పత్తి ప్లాంటుల్నికూడా నెలకొల్పి ఐసు అమ్మకం కొనసాగిస్తున్నారు. హైదరాబాదు, నిజాంసాగర్ లలోని శీతలగిడ్డంగులు ప్రధానంగా మత్స్యశాఖవారు పట్టిన చేపలను, హైదరాబాదులోని బెస్తపనివారల కేంద్ర సహకార సంఘం లి. — వారు పట్టినచేపలను నిలవజేయడానికి ఉపయోగిస్తున్నారు.

ప్రస్తుతం ఆహారకొరతను అధిగమించడానికి భారతప్రభుత్వం సూచించిన విధంగా మత్స్యసంపదను త్వరితగతిని అభివృద్ధిపరచే పథకాలను చేపట్టడం జరిగింది. ఇది క్రేష్ ప్రోగ్రాం క్రిందకు వస్తుంది. నరసాపురం, నాగార్జునసాగర్, తాడేపల్లిగూడెము లలో ఐస్-కం-శీతలగిడ్డంగులు ఏర్పాటు చేయబడుతున్నాయి.

## 11. శీఘ్రరవాణా సౌకర్యాలు:

చేపల్ని పట్టుకున్నచోటునుండి మార్కెటు చేసేస్థలానికి వాటిని కుళ్ళిపోకుండా తాజాగా వుండగానే చేరవేసి లాభసాటి పొందడానికి వీలుగా మత్స్య పరిశ్రమశాఖ కొన్ని వాహనాల్నీ, పడవలను నడుపుతోంది. పట్టిన చేపల్ని యీ విధంగా చేరవేసి, అందుకుగాను ఆయా జాలర్లనుండి అద్దె చార్జీలు వసూలు చేయడం జరుగుతోంది. 1964-65తో కొత్తమార్గాలను వేటినీ వెయ్యలేదు అయితే అవసరమనుకున్న చోట్లమాత్రం ఉన్న మార్గాలను ఆటుగా మళ్ళించడం జరిగింది.

సత్వరాభివృద్ధి పథకం క్రింద శీఘ్రరవాణా సౌకర్యాలు కల్పించే నిమిత్తం మూడు వ్యానులలో ఇన్సులేటర్లు అమర్చడము, ప్రస్తుతం ఉన్న రెండు మోటార్లకు డీజల్ ఇంజన్లు అమర్చడం వంటి కార్యక్రమాలను చేపట్టారు. దీనికై 1964-65 1965-66 లకు రు 800 లక్షలు కేటాయించారు. హైదరాబాదులో ఉన్న రెఫ్రిజిరేటర్ మోటారుతో పాటు హంగెరీ నుండి మరో 5 రెఫ్రిజిరేటర్ మోటార్లను తెప్పించుతున్నారు.

## 2. రోడ్డు కమ్యూనికేషన్స్:

బెస్తల పల్లెలు కోస్తా ప్రాంతంలో చెల్లాచెదురుగా ఉన్న కారణంగా నగరాలు, పట్టణాలలోని వినియోగ కేంద్రాలకు యీ గ్రామాలకు మధ్య కమ్యూనికేషన్ సౌకర్యాలు లేవు అందువల్ల రోడ్లను నిర్మించి జాలర్లు తమ చేపలను విక్రయించడానికి అవసరమైన మార్కెటు సౌకర్యాలు కల్పించడానికి చర్యలు తీసుకుంటున్నారు. సత్వ

రాభివృద్ధి పథకం క్రింద కోస్తా ప్రాంతంలో జెస్తి పల్లెలకు 35 మైళ్ళ 6 ఫర్లాంగుల రోడ్లను నిర్మించాలని ప్రతిపాదించారు. 1. భోగాపురం నుండి ముక్కాం 2. దొంతకుర్రునుండి పొండి 3 తొండంగి నుండి దానాయిపేట 4 సన్నిపూర్ నుండి బెనుల దీవి 5. భీమవరం నుండి గొల్లవాని తిప్ప. 6. అడవులదీవినుండి కొత్త పాలెములమధ్య యీ రోడ్లను నిర్మిస్తారు.

ఈ విషయమై 1964-65 లో రు. 12.00 లక్షలు కేటాయించారు.

### 13. సాంకేతిక విద్య:

కాకినాడలోని మత్స్యపరిశ్రమ శిక్షణ సంస్థలో శాఖాధికారులకు, జాలర్లకు సాంకేతిక విద్యను నేర్పుతున్నారు. ఈ సంస్థను ఉన్నత స్థాయికి మార్చడానికి ముందు దీనిని జాలర్ల శిక్షణ సంస్థగా వ్యవహరించేవారు. శిక్షణకాలంలో యీ సంవత్సరం వారు 26821.5 కే. జి. ల చేపలు పట్టారు. మత్స్య పరిశ్రమ విస్తరణ, సర్వే, ఆఫీసు విధానాలు, లైసెన్సులు యిచ్చే పద్ధతులు, నావలనిర్మాణం నదులలో చేపలు పట్టడం వంటి వివిధ విషయాలపై శాఖాధికారులు, కాకినాడలోని మత్స్య పరిశ్రమ సాంకేతిక కేంద్ర సంస్థయొక్క సబ్‌స్టేషన్ అధికారులు, హైదరాబాదులోని భారత ప్రభుత్వ మత్స్యపరిశ్రమ విస్తరణ సహాయాధికారి ప్రభృతుల ప్రత్యేక ఉపన్యాసాలు ఏర్పాటు చేశారు. శాఖాధికారులకు 6 నెలల ప్రాక్టికల్ శిక్షణతోపాటు వారికి రెండు పునశ్చరణ కోర్సులను కూడ నిర్వహించారు.

పాలిటెక్నికులో ఎల్. ఎఫ్. టి. ఎస్. కోర్సును రద్దుపరచి, 1965 సెప్టెంబరు 1 వ తేదీనుండి రెండు సంవత్సరాల పోస్ట్ గ్రాడ్యుయేటు డిప్లొమాకోర్సును ప్రవేశపెట్టారు.

### 14. విస్తృత పౌష్టికాహార కార్యక్రమం:

గర్భిణీస్త్రీలు, పాఠశాలలకు వెళ్ళే బాలబాలికలు మొదలైనవారికి ఉచితంగా చేపలు సరఫరాచేసే ఉద్దేశంతో యీ పథకాన్ని ప్రవేశపెట్టారు. 19 బ్లాకులలో పంచాయతీ సమితుల ద్వారా యీ పథకాన్ని అమలు జరుపుతున్నారు. 1963-64 లో 72934 పౌండ్ల చేపలు పంపిణీ చేశారు. 1964-65 సంవత్సరంలో 17 బ్లాకులలో యీ పథకాన్ని విజయవంతంగా అమలు జరిపారు. ఈ విషయంలో మత్స్యశాఖ మంచి ఫలితాలను సాధించింది. 6740 మందికి 45011 పౌండ్ల చేపలు పంపిణీ చేశారు. 140 మంది జాలర్లకు ఆధునిక విధానాలలో శిక్షణ ఇచ్చారు.

### 15 చేపల మార్కెటింగ్, హక్కాగము (మత్స్యపరిశ్రమ)

చేపల ఉత్పత్తి ఎంత ముఖ్యమో తాజా చేపల మార్కెటింగ్ కూడ అంతే ముఖ్యమైనది. చేపలు త్వరగా కుళ్ళిపోయేవి కాబట్టి మార్కెటింగ్ విషయంలో సత్వర చర్యలు, జాగ్రత్త చాలా అవసరం. ఎపెక్స్ జాలర్ల కేంద్ర సహకార సంఘాలు యీ విషయాలను నిర్వహిస్తున్నాయి.

1965 మార్చి 31 నాటికి ఆంధ్ర ప్రాంతంలో విజయవాడ హెడ్ క్వార్టర్స్‌గాను, తెలంగాణా ప్రాంతంలో హైదరాబాద్ హెడ్ క్వార్టర్స్‌గాను 2 ఎపెక్స్‌సంఘాలు; 498 ప్రాథమిక జాలర్ల సహకార సంఘాలు. 6 జాలర్ల సహకార మార్కెటింగ్ సంఘాలు పనిచేస్తున్నాయి. కోనసీమ మాస్టర్ ప్రణాళిక క్రింద అమలాపురంలో కేంద్ర డెల్టా జాలర్ల కేంద్ర సహకార సంఘాన్ని నిర్వహిస్తున్నారు. మత్స్య పరిశ్రమకు అవసరమైన వస్తువుల సరఫరా, పరపతి సౌకర్యాలు, చేపల మార్కెటింగ్, సత్వర రవాణా సౌకర్యాలు, శీతల నిల్వ కేంద్రం, జాలర్ల శిక్షణ, పొగబట్టీలు, యాంత్రిక నావల సరఫరా, చేపల స్టాల్స్ నిర్మాణం వంటి కార్యక్రమాలను యీ సంస్థ నిర్వహిస్తుంది.

### *1964-65 మాస్టర్ ప్రణాళిక* (కోనసీమ, అభివృద్ధి):

ఈ సంస్థకు మొత్తం రు. 1,29 248 ల లాభం కలిగింది. చేపలవిక్రయం నైలాన్ వల దారం పంపిణీవల్ల నికరంగా రు. 69,912 లాభం చేకూరింది.

ఈ సంస్థద్వారా జాలర్లకు రు 99360 ల రుణాలు మంజూరు చేశారు.

5 టన్నుల శక్తిగల ఐస్ ప్లాంటు, 10 టన్నుల శక్తిగల శీతలగిడ్డంగి నెలకొల్పుతున్నారు.

చేపలుపట్టే నిమిత్తం శిక్షణపొందినజాలర్లకు రు. 3.00.000 ల విలువగల వలలు, 15 యాంత్రిక నావలు మొదలైనవి సరఫరా చేశారు.

సత్వరరవాణా సౌకర్యాల నిమిత్తం రు. 90,000 ల ఖరుతో రెండు మోటారు ట్రక్కులను కొనుగోలు చేశారు

పల్లాం గ్రామంలో పొగబట్టీ నిర్మాణం చురుకుగా కొనసాగుచున్నది

'ఇంటింట సరఫరాపథకం' క్రింద కాకినాడలోని సంఘం 4 మూడుచక్రాల సైకిళ్ళను కొనుగోలు చేసింది. ఈ సంఘానికి ఇంతవరకు రు. 91.755 నికరలాభం వనకూడింది.

### ఎపెక్స్ జాలర్ల సహకార సంఘాలు:

రెండు ఎపెక్స్ జాలర్ల సంఘాలు సంతృప్తికరంగా నిర్వహింపబడుతున్నాయి. ఈ రెండు సంఘాలు చెప్పుకోదగిన పరిమాణంలో కలకత్తాకు చేపలను ఎగుమతిచేశాయి. రు.2.75,118ల విలువగల చేపలను విక్రయించాయి. వలలకు నైలాను దారం ఉపయోగించే విధానం జాలర్లలో బహుళ ప్రచారంలో ఉన్నది. చేపలు పట్టడంలో యీ వలలు ఉపయోగకరంగా పనిచేస్తూ దీర్ఘకాలం మన్నికగా ఉంటున్నాయి. ఈ సంవత్సరం రెండు సంఘాలు రు. 4,18,[illegible]58.00 ల విలువగల సింథెటిక్ దారాన్ని పంపిణీ చేశాయి. జాలర్ల సహకార సంఘాలకు, జాలర్లకు సింథెటిక్ వలదారం, నావలు, దుక్కులు,

తెప్పలు మొదలైన పరికరాల సరఫరా నిమిత్తం ఆంధ్ర జాలర్ల కేంద్ర సహకార సంఘానికి రు 3.5 లక్షలు హైదరాబాదు కేంద్ర సహకార సంఘానికి రు 1 25 లక్షలు ప్రభుత్వం మంజూరు చేసింది. సేకరణ కేంద్రంనుండి మార్కెటింగ్ కేంద్రాలకు చేపలను సత్వరంగా రవాణా చేయడానికి వీలుగా హైదరాబాదు జాలర్ల కేంద్ర సహకార సంఘం ఇన్సులేటెడ్ గల మోటారు వాహనాన్ని నిర్వహిస్తున్నది.

కోలేరు ప్రాంతం జాలర్లు ఏలూరు వెళ్ళి తమ చేపలను విక్రయించడానికి వీలుగా ఆంధ్ర జాలర్ల కేంద్ర సహకార సంఘం, ఏలూరులో కొల్లేరుసంతనుఏర్పాటుచేసింది.

జంట నగరాలలో చేపల ఆహారాన్ని బహుళ ప్రచారం చేసే నిమిత్తం హైదరాబాదు జాలర్ల కేంద్ర సహకార సంఘం, మత్స్య పరిశ్రమ శాఖ డైరెక్టరు కార్యాలయంలో క్యాంటిన్ నిర్వహిస్తున్నది.

కాకినాడలో షార్క్ లివర్ ఆయిల్ ప్లాంటును నెలకొల్పడానికి వీలుగా ఆంధ్ర జాలర్ల కేంద్ర సహకార సంఘానికి ప్రభుత్వం రు 1 00 లక్ష రుణం మంజూరు చేసింది. ఈ సంవత్సరం ప్లాంటును నెలకొల్పే పని పూర్తి అవుతుంది.

రెండు ఎపెక్స్ సంఘాలను విలీనంచేసి "ఆంధ్రప్రదేశ్ రాష్ట్రజాలర్ల సహకార సంఘం"గా ఏర్పాటుచేయాలని వారు నిర్ణయించారు. దీని కార్యస్థానం హైదరాబాదులో ఉంటుంది. ఇది త్వరలోనే కార్యరూపం దాలుస్తుందని ఆశించబడుతున్నది.

## 16. చేపల ఉత్పత్తి:

1964లో ఆంధ్రప్రదేశ్‌లో 1,32,800 టన్నుల సముద్రపు చేపల ఉత్పత్తి జరిగింది. అదేవిధంగా రాష్ట్రంలోని నదీ నదాలనుండి ఇదే కాలంలో 99 800 టన్నుల చేపల ఉత్పత్తి జరిగింది.

## 17. శాఖాదాయం:

మత్స్య శాఖకు గతసంవత్సరాలలో వచ్చినరాబడిని పెంపొందించడం జరుగుతున్నది. ఈ శాఖకు 1960_61 లో రు 5.33 లక్షల ఆదాయం లభించగా 1964_65 లో రు 25.67 లక్షల ఆదాయం కలిగింది.

కోనసీమ ప్రాంతంలో మత్స్యపరిశ్రమాభివృద్ధి నిమిత్తం కేంద్ర డెల్టాజాలర్ల సహకార సంఘం అమలాపురంలో మాస్టర్ ప్రణాళికను ప్రవేశపెట్టింది 1964 ఏప్రిల్ 8న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి దీనికి ప్రారంభోత్సవం చేశారు. తూర్పుగోదావరి జిల్లా కోనసీమ ప్రాంతంలో మత్స్య పరిశ్రమాభివృద్ధికి ఈ పథకం నిర్దేశించబడింది. ప్రత్యేకప్రాంతంలో మత్స్య పరిశ్రమాభివృద్ధికి పథకాన్ని ప్రవేశపెట్టడం ఈ సంఘానికి యిదే ప్రథమం.

1965 సంవత్సరంలో మరోముఖ్యాంశం రెండు ఏపెక్స్ జాలర్ల సహకార సంఘాల ద్వారా జాలర్లకు రుణాలు పంపిణీ చేసే విధానాన్ని ప్రవేశపెట్టడం ఇంతవరకు మత్స్య పరిశ్రమకు అవసరమైన పరికరాలను శాఖ సిబ్బందీ ద్వారానే జాలరలకు సరఫరా చేసేవారు. పరికరాల నిమిత్తం రుణాలు ఇవ్వడానికి కేటాయించిన నిధులను యిప్పుడు ఎపెక్స్ సంఘాలకు మార్పిడి చేశారు. ఎపెక్స్ సంఘాల ద్వారా ప్రాథమిక సహకార సంఘాలకు, జాలర్లకు రుణాలు లభిస్తాయి.

"సత్వరాభివృద్ధి కార్యక్రమం" అనే ప్రత్యేక అభివృద్ధి కార్యక్రమాన్ని ప్రవేశపెటడం మరోముఖ్యాంశం రెండు సంవత్సరాలలో ఆహారోత్పత్తిని అధికం చేయడానికి రు 21 85 లక్షల ఖర్చుతో యీ కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నారు. 1964 సెప్టెంబరులో యీ పథకాలను మంజూరు చేశారు

అండమాన్ దీవుల ప్రభుత్వానికి 20 మరపడవలను విక్రయించడం మరో ముఖ్య విషయం. దేశంలోని ప్రైవేటు పారిశ్రామికులు అమ్మజూపినప్పటికీ మరో రాష్ట్రప్రభుత్వం ఈ రాష్ట్రం నుండి (20) మరపడవలను కొనుగోలు చేయడం ఇదే ప్రథమం. కాకినాడలోని మత్స్యశాఖకు చెందిన పడవల నిర్మాణం కేంద్రంలో నిర్మితమైన పడవల నాణ్యతకు యిది మంచి నిదర్శనం.

విదేశాలకు చేపలు ఎగుమతి చేయాలని సముద్రాలలో చేపలు పట్టాలనే ముఖ్య ఉద్దేశంతో కాకినాడలో మత్స్య ఉత్పత్తుల కంపెనీ పేరుతో ఒక ప్రైవేటు మత్స్య పరిశ్రమ కంపెనీ స్థాపించబడింది. కాకినాడలో ఐస్_శీతల గిడ్డంగి ప్లాంటు, డీప్ ఫ్రీజింగ్ ప్లాంట్లను నెలకొల్పడానికి, రు 8,11,410 లు సముద్రములో చేపలు పట్టడానికి (8) మరపడవలు యీ సంస్థకు మంజూరు చేశారు.

తెలంగాణా ప్రాంతంలోని చెరువులను పంచాయతీల పరం చేశారు. గత సంవత్సరం తెలంగాణా ప్రాంతంలోని చెరువులన్నీ శాఖ ఆధీనంలోనే ఉన్నాయి. ప్రభుత్వ ఉత్తర్వుల ననుసరించి యీ సంవత్సరం, 19159 చెరువులలో 15873 చెరువులను స్థానిక సంస్థల పరం చేయడం జరిగింది. పంచాయతీలు తమ ఆధీనంలోని చెరువులను అమ్మడం ద్వారా కొంత రాబడిని సంతరించుకుంటాయి.

హైదరాబాదు, సికింద్రాబాదు జంట నగరాలలో చేపల అమ్మకం బాగా పెరిగింది. హైదరాబాదు జాలర్ల కేంద్ర సహకార సంఘం హైదరాబాదులో నెలకొల్పిన విక్రయశాలద్వారా విక్రయాలు నిర్వహించబడుతున్నాయి. అవసరాలకు మించి సరఫరా ఉన్నకారణంగా కటక్ కలకత్తాలకు యీ సంఘం చేపలను ఎగుమతి చేస్తున్నది.

పంచాయతీల ఆధీనంలోని చెరువులలో చేపలపెంపకానికి వినియోగిస్తున్న పెట్టుబడికి రెండింతలు మూడింతలు లాభం ఒనగూడుతున్న దృష్ట్యా బ్లాకులలో మత్స్య పరిశ్రమాభివృద్ధి బహుళ ప్రచారంలో ఉంది. చేపల పెంపకానికి వీలుగా చెరువులను పునరుద్ధరించడానికి మూడు పంచాయతీలకు రు 29000 ల రుణం మంజూరు చేయబడింది.



Edited and Published by the Director of Information and Public Relation, Andhra Pradesh, Hyderabad
Printed at YUVA PRESS, Public Garden Road, Hyderabad

